# అమృతాంజన్ లిమిటెడ్

## 75 సంవత్సరాల పైగా గృహౌషధములు తయారుచేస్తున్నారు!

- అమృతాంజనం బాధానివారిణి
  తలనొప్పి, ఒళ్ళునొప్పులు, బెణుకులు, జలుబు, దగ్గు, కండరాల నొప్పులకు.
- అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
  పసిబిడ్డల అజీర్ణానికి, పళ్ళు వచ్చేటప్పుడు కలిగే బాధలకు
- అమృతాంజన్ డెర్మల్ అయింట్‌మెంట్
  తామర, తీట, గజ్జి వగైరాలకు,
- అమృతాంజన్ ఇన్‌హేలర్
  జలుబుచేసి ముక్కుదిబ్బడ, తుమ్ములు వగైరాలకు
- అనోలియమ్-కోల్డ్ రబ్
  దగ్గు జలుబులను పారద్రోలే అమోఘమైన ఒక కొత్త శక్తి
- శాలోఫెన్ -బాధానివారిణి మాత్రలు
  తలనొప్పి, ఫ్లూ, ఒళ్ళు నొప్పులకు

. ఇండియాలోను,
ఇతర దేశాలలోను
పేరు పొందినవి.

**అమృతాంజన్ లిమిటెడ్**
మద్రాసు-4



# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

ఏప్రిల్ 1975

సంపుటము : 52 : సంచిక :

విడిప్రతిక వెల రూపాయిన్నర

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1975

# రాక్షసాభ్యర్థనము

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

స్వాగతం బిదియె రాక్షసనామ సంవత్సరమ! నీకు హృదయపూర్వకము గాఁగ
నవవసంతశ్రీలఁ జివురులెత్తెడు మాదు, హృదయవృక్షంబు లెంతేని మరల
పుంస్కోకిలారావములు మేలుకొల్పులై, శ్రవణయుగ్మప్రీతి సంఘటించు
నాత్యుష్ణ మౌచును నాతిశీతల మౌచు, రమణీయవాతావరణ మొసంగు

సెలవుగొని యేగుచున్న దంచితము గాఁగ
గతమయినవర్ష 'మానంద' కాలమహిమ
కెవరు బద్ధులు కారు? నిష్కృతి ప్రవేశ
మును విధివిహిత మన్నిటికినిజగమున

వచ్చినవారు పోక నిలువంగలరే కలకాల మెంతగాఁ
జచ్చినఁగాని అజ్ఞతను శాశ్వత ముందు మటంచు నెంతు రీ
పిచ్చి అనంత మర్త్యులకుఁ బెద్దల కించుకమాత్ర ముండెడిన్
వచ్చుట పోవుకోసమయి వైభవముల్ నశియించుకోసమై

నేతిబీఱ లెన్న నిఖిలనామంబులు అజ్ఞులట్లు నమ్మ రవి విబుధులు
అరిగినట్టివర్ష 'మానంద' నీవొ 'రాక్షస'వు మాకు రెండు సమములె సుమ!
ఆనందాభాసంబున, 'నానంద' చనెన్; ప్రజాళి యటమటలందెన్
నీనామంబున కడలము, లేనేలేకుండవచ్చులే రాక్షసతల్.

జ్ఞానాతిథేయంబు సకలప్రపంచంబు, నకు నిచ్చినట్టిదేనా? యిపు డిటు
లజ్ఞానమూలమై యటమటించుచున్న, దీ భారతంబు నాదేన?! అకట!
క్షామంపువేళల సకలలోకంబుల. కన్నంబు పెట్టినయస్మదీయ
దేశమేనా యిప్పు డేశనియో పట్టె, అన్నమో రామచంద్రా యనుఁగట!

, మిగులఁ బొగడొందెఁ ద్యాగభూమిగను నేది?
అదియె స్వార్థంబునిలయమే యైనదా? యి
దేమి? కలయా? నిజంబ? యీపామరతకుఁ
గారణము నీవు కూల్చు రాక్షస! ప్రియముగ.

నా భారతంబు సుజ్ఞానకల్పకమౌచు, నీకాలమందున నెగడుఁగాక!
నా భారతంబు సుశోభాయమానమై, కనుఁగాక పూర్వసద్గౌరవంబు

స్వర్ణఖండఖ్యాత సస్య నికాయంబు, ముక్కారుఁ బండి యోముత! ప్రజలను
నిస్వార్థపరతకు నిలయమై దేశంబు, పాలింపఁబడుఁగాక! ప్రభువరులను

రాక్షసయే మేలు బహుసహస్రసంపుగతుల
ననుచుఁ బ్రజ లంద ఱానంద మందునట్లు
నెగడవలయును నీవిల నిరుపమముగ
రాక్షసాబ్దమ నీవేమఱంజన దీక.

మాయాంధ్రజాతిని మాయకప్పిన దేమొ, లేదెందు జవజీవనాదికంబు
అలదారు గర్వమే అభ్యున్నతంబయి, శాంతియేలేక యశాంతి ప్రబలె
మాటలే—చేతలు మటుమాయమయ్యెను, ఆదర్శమే హీనమయ్యె మిగుల
సకలప్రపంచాంధ్రసభ యనలేక "ప్రపంచతెలుఁ"గనియాపాదువడిన

దోషయుతసమాసం బదేందులకొ? దైవ
మెఱుఁగు; నిన్నాళ్లనుండి యీయింతలేపి
కవులు తమదు "సాహిత్య అకాడమీ"కి
సముచిత సమాసమున్ చెప్పఁజాలరైరి

భాషాయోషకు భూషణంబు లివియా? ప్రారబ్ధమా యేమొ? ఆ
యోషారత్నము పూర్వవైభవము తా నూహించి యెంతెంతగా
ఘోషించున్ గడు రాల్చు నశ్రుకణముల్ కొంగ్రొత్త వేపి నగల్?
బేషా! నేలను వీడు సాము గలదే విశ్వంబునం దెయ్యెడన్?

మందారబృందసమ్మకరందమును మించు, మధురపదంబులు సుధలు చిలుక
నిత్యనూతనములన్ నిరుపమాలంకార, నిచయవిలాసముల్ నెగడుచుండ
తాత్కాలికానంద తత్పరత్వముగాక, శాశ్వతానందలక్షంబు వెలయ
తరతరంబులనుండి పరతెంచుచున్నట్టి, సత్సంప్రదాయప్రశస్తి నిల్పి

కవులు కవితామతల్లిని గ్రమభంగి
భక్తితోడ నుపాసించు భవ్యదినము
లరుగుదెంచును గాక! వవాబ్దమ! భవ
దీయపారనమందు సందీప్తభంగి.

మహనీయాత్మక మాంధ్రభారతి జగన్మాన్యత్వముం గాంచు న
న్మహనీయస్థితి నందుఁగాక! పరమానందంబుతో నాంధ్రు ల
న్వహ మామెన్ సముపాసనన్ గొలిచి దివ్యత్వంబునుంగాంచ ని
స్పృహ కా లూననియట్లు రాక్షస! కటాక్షింపంగదే మ్రొక్కెదన్.

---

# అరవిందుల కవితా "రహస్యం"

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్, M A., Ph. D

అని నేను ఎఫ్ ఏ చదువుకుంటున్న రోజులు. ఇంగ్లీషు పొయిట్రీని మాకు ముత్తు అయ్యర్ అని ఓ ప్రొఫెసర్ బోధిస్తు వుండేవాడు మా పాఠ్య గ్రంథంలో మొదటి ఖండిక విలియం బ్లేక్ రచించిన 'టైగర్' **'Tiger, Tiger Burning Bright in the forests of the night'** అని ముత్తు అయ్యర్ ఆ ఖండికను వివరిస్తుంటే తన్మయుణ్ణై విని బ్లేక్ చాలా గొప్పవాడని తీర్మానించుకున్నాను ఈ ఖండికలో విలియం బ్లేక్ శార్దూలంయొక్క ఘనతను బహుముఖీనంగా ప్రశంసించి ఇంత 'చారు భీషణ' రూపాన్ని నిర్మించడానికి ఈశ్వరుడు ఏ యే పనిముట్లు వాడాడో ? అని ఆశ్చర్యపోతాడు.

అదే పాఠ్యగ్రంథంలో మాకు అరవిందులు రచించిన **'The Tiger and the Dear'** అనే ఖండిక కూడా చివర వుండేది. అందులో అరవిందులు శార్దూలంలోని క్రౌర్యగుణాన్ని నిరసిస్తారు అమాయకంగా నీళ్ళు తాగే హరిణంపై బడి చంపి రక్తపాతాన్ని సృష్టించిన ఓ శార్దూలమా ! నీ జాతి చిరకాలం జీవించదు. ప్రకృతిలో నీవూ **Mammoth** వలె కాలగర్భంలో కలిసిపోక తప్పదు అంటారు మహర్షి. ఈ ఖండిక విద్యార్థులైన మమ్మల్ని ఆకర్షించలేదు. మా ప్రొఫెసరుగారిని ఆకర్షించలేదనే చెప్పవచ్చు కారణం విలియం బ్లేక్ ఖండికను వివరించేటప్పుడు ఆయన చూపిన అభినివేశం అరవిందుల ఖండికా వ్యాఖ్యానంలో చూపలేదు!!

ఇది జరిగి చాలా సంవత్సరాలైంది. ఇటీవల అరవిందులగూర్చి అధ్యయనం చేస్తూవున్న సందర్భంలో నా కెందుకో ఈ సంఘటన గుర్తుకొచ్చింది! అలా ఆలోచిస్తూ వుండగా నాకు అకస్మాత్తుగా అరవిందులు ఇందులో తమ అతిమానస సిద్ధాంతాన్ని ప్రతిపాదించారనే మహారహస్యం తళుక్కున స్ఫురించింది. వెంటనే ఈ దృష్టితో అరవిందుని కవితలను మళ్లీ పఠించాను. నాకు స్ఫురించిన ఊహ యదార్థమైనదేనని తీర్మానించుకున్నాను.

అతిమానస సిద్ధాంతం ప్రకారం వర్తమానం వరకు జరిగిన ప్రకృతి పరిణామం అసంపూర్ణం అంటారు మహర్షి. ఇది డార్విన్ సిద్ధాంతానికి విరుద్ధం. మానవునితో పరిణామక్రమం ఆగిపోలేదు అతిమానసులూ అతిమానవులూ ఉద్భవిస్తారు–అంటారు అరవిందులు. ఆ మహాపురుషులు (Supermen) లోగడ అక్కడక్కడా చెదురు మదురుగా ఉద్భవించి ఉండవచ్చు కాని మహాపురుషుల సమాజం మాత్రం ఈ కలియుగంలో మళ్లీ ఏర్పడవలసి వుంది. ఇప్పటి వరకు జరిగిన పరిణామం ప్రకృతి దానంతట అదే సహజంగా సాధించింది భౌతికంగా పదార్థం పొందిన పరిణామంలో అతిశ్రేష్ఠమైనది మనస్సు. ఇది మానవుని అధీనంలో వుంది కాబట్టి ఇకమీద మనస్సు సహాయంతో మానవుడు తానే స్వయంకృషితో అతిమానస యుగం నిర్మించుకోవచ్చు. అలా మన ప్రయత్నంతో చేయబడ్డ 'యుగమే' కృతయుగం. ఇదే మన ప్రాచీన మహర్షుల ఆదర్శం కూడా!!

అరవిందులు ఈ సిద్ధాంతాన్ని పాండిచ్చేరిలో ప్రవచించినా అంతకుముందు వారు బరోడా సంస్థానంలో వున్నప్పుడే ఈ తత్వం వారి హృదయంలో బీజ రూపంలో వున్నదీ అనడానికి ఈ కవితలే ప్రబల నిదర్శనం. 1926లో వారు భగవత్ సాక్షాత్కారం పొందే వరకూ ఈ రచనా వ్యాసంగాన్ని ఒక సాధనగా స్వీకరించారేమో నని పిస్తుంది. పాండిచ్చేరి నుండి తర్వాత వారు ప్రచురించిన కవితలలో ఎక్కువ భాగం వారు బరోడాలో వున్నప్పుడు వ్రాసినవే! అంటే వాటి రచనా కాలం 1893–1906 తర్వాత 1915 నుండి 20వరకు 'ఆర్య' పత్రికలో వచ్చిన రచనలు కొన్ని అప్పటికప్పుడు వ్రాసినవి, కొన్ని ముందే వ్రాసి పెట్టుకున్నవీను!

**'The Tiger and the Deer'**, **'Rose of God'**, **'Thought of the Paraclete'** లన్న ఖండికలను అరవిందుల ఈ 'దివ్యపురుష' సిద్ధాంత ప్రతిపాదనకు ఉదాహరణగా తీసుకోవచ్చు శార్దూలం ప్రకృతిలో ఘనీభవించిన రజస్సుకు ప్రత్యక్ష రూపం లేదు వికసిస్తున్న సత్వానికి సాకారం నేటి వరకూ. రజస్సు ఇంకా అతివేలంగా విజృంభిస్తూ సత్వాన్ని నిర్మూలిస్తూ–

తన రాజసమైన ప్రభుత్వాన్ని స్థాపించుకుంటూనే వుంది. అయితే ఇది శాశ్వతంగా ఇలాగే సాగదు పరిణామక్రమంలో ఈ రజస్సు యొక్క ఆధిపత్యం నశించి సత్యయుగ స్థాపన జరుగుతుంది. దేవ్ల రాజ్యం వస్తుంది! అదే 'The Tiger and the Deer' లో . అర విందులు చెప్పదలచుకొన్న భావం. ఇందులో వారు పులిని మామొత్‌తో పోల్చారు. పరిణామక్రమంలో నశించిన ఒక జంతువు మామొత్ అది ఏనుగుకన్నా చాలా పెద్దది. చరిత్రలోనూ మ్యూజియంలో మాత్రమే , నేడు మిగిలిపోయి ఆ జంతువుయొక్క జాతి నశించి పోయింది. పులికూడా అంతేసుమా! అంటారు మహర్షి ఇక్కడ అర విందులు ప్రకృతిలోని పులులనే జంతువులను ద్వేషిస్తున్నారని మనం అర్థం చేసుకోకూడదు. 'శార్దూల ప్రవృత్తి'ని మాత్రమే వారు తిర స్కరిస్తున్నారని గ్రహించాలి.

'The Rose of God' అనే ఖండికలో సాధకుడు ఈశ్వ రాభిముఖంగా ప్రయాణం చేయడం కన్పడుతుంది. ఈశ్వరుడు దయామయుడు. ప్రేమమూర్తి. ఐశ్వర్యం అంటే ఈశ్వరీయమైన గుణాలు. ఈశ్వరానుభూతి అంటే గుణాత్మకంగా ఈశ్వరత్వాన్ని మన హృదయంలో ప్రతిష్ఠాపించడం. అదే భూమిపై 'దివ్యరాజ్య' స్థాపన (The Kingdom of Heaven)కు దోహదం చేస్తుంది. ఈ సచ్చి దానంద స్వరూపుణ్ణి అందుకోవడమే 'Thought of the Paradete' అన్న ఖండికలోని భావం. ఇందులో అరవిందులు గాయత్రీ మంత్రార్థాన్ని నిక్షిప్తం చేశారు. గాయత్రి యజుర్వేదంలో (అ. 36. మం. 3.) వుంది. ఇందులో పరమేశ్వరుడు 'భూః' 'భువః' 'స్వః'. అనే పేర్లతో పిలువబడుతున్నాడు. తైత్తిరీయంలోని, 7వ ప్రపాఠం లోని, 5వ అనువాకంలో వీటికి అర్థాలు వివరింపబడి వున్నాయి. "భూరితివై ప్రాణః 'యః ప్రాణయతి చరాచరం జగత్ సభూః స్వయం భూరీశ్వరః"—"భువరిత్యపానః—యః సర్వం దుఃఖమపాన యతి సోఽపానం" "స్వరితి వ్యానః—యోవివిధం జగత్ వ్యానయతి వ్యాప్నోతి సవ్యానః" ఇవి ఈశ్వరీయలక్షణ నిర్వచనాలు. 'భర్గ' శబ్దం శుద్ధసత్వానికి సంకేతం. గుణాత్మకంగా ఈ బ్రహ్మాన్ని మేము ధరిస్తాము (ధీమహి — ధరేమహి.) — దీని ప్రయో జనం, ఆ సవిత మా బుద్ధులను శుద్ధసత్వం వైపుకు ప్రేరేపించడం — (ప్రభోదయాత్—ప్రేరయేత్) — ఇదీ గాయత్రీ మంత్రార్థం 'Thought of the Paradete' లో అరవిందులు ఈ భావాన్ని నిక్షిప్తం చేశారు సామాన్యమైన మనస్సు దైవాభి ముఖంగా ప్రయాణం చేస్తూ ఈశ్వరత్వంలో సుస్నాతమై 'శుద్ధ సత్వం'గా రూపొందడం దీని పరమార్థం. ఇదే 'అతిమానస' యుగా వతరణానికి కావలసిన సాధన!

అరవిందుల తత్వానికి మూల సూత్రాలు 'Ascent, Des- cent'. భౌతిక పదార్థం పైకెదిగి అతిమానస చైతన్యం వికసిం చడం—దివ్యశక్తి మానవాళి కోసం దిగి రావడం — దీని భావం ఈ "ఆరోహణ—అవరోహణ" సిద్ధాంతం అరవిందుల కవితా రచనకు ప్రాణప్రదమైన అంశమని మనం నిర్ధారింపవచ్చు. వారి రచన లన్నింటిలోనూ ఈ తత్వం అంతర్లీనంగా సాగుతున్న సరస్వతిగా మనం తేలికగానే పోల్చుకోవచ్చు. 'Thought of the Paradete' వంటి ఖండికలు ఇందుకు ప్రముఖోదాహరణాలు 'సావిత్రి'లో ఒక చోట "His hope a star above a cradle and a grave" అని మానవతను నిర్వచిస్తారు. 'Cradle' 'Grave' ఈ రెండూ జనన మరణాలకు సంకేతాలు. పుట్టి గిట్టే ఈ భౌతిక జీవనంలో మృత్యుంజయత్వం సాగే పోరాటమే సమున్నతమైన ఆశాజ్యోతిగా మిగిలిపోతున్నది. అదే ఆకాశ దీపం. 'Ascent' ఆరోహణ ! ఈ 'తార' అతిమనస్సుకు సంకేతం! 'Hope' మానవ భావనకూ ఆశకూ సాధనకూ సంకేతం. జాన్ బన్యన్ తన 'Pigrims' Progress' అన్న మత గ్రంథములో 'క్రిస్టియన్' (ఒక భక్తునికి సంకేతం) అమర సామ్రాజ్యాన్ని చేరుకునే యానంలో 'Hope' ఒక ప్రధాన పాత్రగా తోడ్పడటం మనకు తెలుసు! అంటే అరవిందులు వాడే ప్రతి వాక్యం, ప్రతి పదం, చివరకు ప్రత్యక్షరమూ భావగర్భితమై, సార్థకమై, తమ లోతులు కనుక్కోమంటూ మనలను ఆహ్వానిస్తుంటాయి!! 'పదార్థం వధువైతే పరమార్థం వరుడు. మంటికీ మింటికీ జరిపే ఈ కల్యాణమే పూర్ణయోగం' అంటారు కవితామయంగా ఒక చోట మహర్షి ! !

అరవిందుల తొలిరచన 'Songs of Myrtilla'-తుది రచన 'సావిత్రి'. యాభై సంవత్సరాలు నిరంతరం జరిగిన ఈ కవిత సాధన' 'చిత్రకవిత్వం' కోసమూ అంత్యానుప్రాసల ఆర్భాటంకోసం 'చౌకబారు ఆకరణ'ల కోసమూ సాగిందికాదు తమ దివ్యజీవన సిద్ధాంతాన్ని ప్రదర్శించడంకోసం ఆంగ్లేయులకు పరిచయంలేని ఆధ్యా త్మికపు లోతులు చూపించడంకోసం — ఇంకా చెప్పాలంటే తాము జరిపే పూర్ణయోగ సాధనలో తమ మనస్సును అతి మానసదశకు ఆరోహింపజేయడంకోసం ఈ కవితను వారొక సాధనంగా స్వీకరించ

మని మనం గమనింపవచ్చు!! ధ్యానంలో సమాధిలో వారు పొందిన దర్శనాలు కవితలుగా ఖండికలుగా రశ్మలుగా మనకు ఆవిర్భవించాయి ఈ కవితా రచన అరవిందుల శబ్దబ్రహ్మోపాసనమని మనం గుర్తించ నిదే ఆ విందుల రచనలు మనకసలు అర్థంకావు!! పద్య కవిత్వంలోనే కాదు '**Life Divine**' వంటి గద్య ప్రబంధాలలో కూడా ఈ తత్త్వ రహస్యమే నిక్షిప్తం చేయబడింది!

'సావిత్రి' రచనకు తొలిమెట్టుగా అరవిందులు '**Love and Death**' అనే లఘు కావ్యం రచించారని అనిపిస్తుంది. భారతం ఆది పర్వంలోని రుకుడు—ప్రమద్వర వృత్తాంతం ఇందు వర్ణింపబడింది సర్పాన్ని కాలసర్పంగా మృత్యువుకు సంకేతంగా అరవిందులు స్వీకరించి ప్రేమమృత్యుంజయ మహామంత్రమని ఇందులో నిరూపిస్తారు దాదా పుగా 'సావిత్రి'లోని సందేశం కూడా ఇదే!

అరవిందులు '**Siva**' అన్న ఖండికలో కూడా ఈ మృత్యుం జయతత్త్వమే ప్రతిపాదిస్తారు. శివుడు గరళకంఠుడు. సర్పాభరణుడు భస్మరేఖాంకితుడు. గడ్డకట్టిన మంచుపై కూర్చున్నవాడు అయినా ధ్యాన ముద్రాంకితుడైన మంగళమూర్తి. మానవాళికోసం కైలాసం (సహస్రారం) నుండి వచ్చిన దివ్యచైతన్యం అని ఇందులో వర్ణిస్తారు మహర్షి!

"భయహిమాలయోపరి శిఖరమ్ముల
పై ధ్యానాంకిత ప్రసన్నవదనము
హిమపాతమ్ముల బోలిన భీకర
తమమగు తెల్లని విభూతిరేఖలు" (నా అనువాదం)

అన్న పంక్తులతో ఈ ఖండిక ప్రారంభమవుతుంది ఆరోహణ (ఊర్ధ్వాభిముఖ త్రికోణం—) అవరోహణ (అధోముఖ త్రికోణం) మధ్యలో ధ్యానకమలం—ఈ అరవింద సంకేతం మనకిలా ప్రతి ఖండిక లోనూ కనపడుతుంది. అరవిందుల కృతులన్నింటిలోకీ సర్వశ్రేష్ఠ మైంది 'సావిత్రి'. దీనికి వారు పెట్టిన పేరు '**Savitri A Legend and a Symbol**', ప్రతిజ్ఞను బట్టే మహర్షి అందరికీ తెలిసిన ఈ కథను ఎలా సంకేతార్థం చెప్పారో ఊహించవచ్చు ఇది 12 పుస్త కాల మహాకావ్యం. మొత్తం 23800 పంక్తులు 1950 వరకూ ఈ గ్రంథ రచన జరుగుతూనే వుంది ఈ కృతి ముగియగానే డిసెం బరులో అరవిందులు సిద్ధిపొందారు ' అంటే ఇది వారి జీవన గ్రంథ మని (**Life work**) చెప్పవచ్చు!

'సావిత్రి'లో వారు మనకు అతిమానస యుగం త్వరలోనే అవతరించగలదన్న హామీని ఇస్తారు. ఇందులో సావిత్రి—సత్యవంతుడు యముడు వ్యక్తులు కాక కొన్ని భావాలకు సంకేతాలు సావిత్రి మాన వతలోని అనంతప్రేమకు సంకేతం సత్యవంతుడు సత్యగుణం. యముడు—మృత్యువు, చీకటి, అవిద్య సత్యానికి తమస్సుకూ జరిగిన సంఘర్షణలో తమస్సు సత్యాన్ని కబళించవచ్చును గాక — కాని మాన వాత్మలోని దివ్యప్రేమయొక్క అనంతశక్తిముందు చివరకు మృత్యువు పరాజయం పొందక తప్పదు. సత్యయుగం తిరిగి అవతరించకతప్పదు— అని ఇందులో అరవిందులు ప్రతిపాదిస్తారు. ఇందలి వర్ణనలన్నీ అద్భు తంగా రసశిఖరాగ్రాలకు మనలను చేర్చేటట్లు ఉండటమే కాదు, అన్నీ ఉపనిషద్రహస్యాలను వివరిస్తూ వుంటాయి ముందు అంధకారం వ్యాపించి వుంటుంది. ఇది మానవునిలోని తమస్సుకు సంకేతం. ఆ పైన ఉషస్సు వస్తుంది అదే సావిత్రి. ఈ ఉషస్సును అరవిందులు వేదర్షులు ఏ సంకేతార్థంలో స్వీకరించారో ఆ మార్గంలోనే వర్ణి స్తారు. 'ఋతేన ఋతమపిహితం ధ్రువంవా' (5-62-1) అన్న వేదోక్తికి ఈ సావిత్రి వర్ణనం వ్యాఖ్యానమని చెప్పవచ్చు. ఇందలి ఉషస్సు ఆధ్యా త్మిక శక్తి యొక్క అంతరమైన వికసనానికి సంకేతం. అది ప్రగతి చెందిన కొలదీ సత్యం పునరుజ్జీవన పొందుతుంది. నల్లని యముని నీడలు పారిపోతాయి నాడే సత్యయుగావతరణం జరిగినట్లు లెక్క !

అశ్వపతి ఇంటికి నారదుడు వస్తాడు. అప్పుడు సావిత్రిని ఆ దివ్యముని చూస్తాడు. చూచి ఇలా అనుకుంటాడు.

"ఈ వధువెవ్వతె? ఈ మధువెవ్వతె?
సుధలు చిందు బాలామణి ఎవ్వతె ?
ఎంత కాంతిమయ మీమె స్వరూపము?
ఏ తొలి వెలుగులకీ అవతరణము ?
శాంతికి నిలయమ్మీ కనుదమ్ములు
సకల మంత్రరాశీ భూతమ్ములు
జల జల జల జారెడి సెలయేరుల
శైవలినీ వల్లీ హల్లీ సః
పర్వత ప్రవర్తనముల లోపల,
ఉదయారుణ మరకత కిరణాంశుకు
పల్లవములు పచ్చలవలె నవ్వుచు
బాలార్కునితో పందెము వేయగ
తరువుల ముసుగునుదాల్చి మెత్తగా
గిరులు ఝరులు ఆనందము నింపగ

ఏ అనుగావరణమ్మో ఇది
ఏ దేవత కవతరణమ్మో ఇట!
పుడమి గుండెలో ప్రేమ పొంగలివి
నీ పంకకదా నీరజేక్షణా!
నరలోకములో నడుచుచున్ననూ
నరావరణ కవతలి పొలిమేరల
మర్త్యుల కందని మహోన్నమ్మగు,
పుడమి పనుల కగుపడని దృశ్యముల

చూచిన తల్లీ ఓ సావిత్రీ !
శుద్ధ దేవతాగణ పరివేష్ఠిత !!
నీ బాటలు నీ మాటలు పాటలు
నీ నాదమ్ములు నీ వేదమ్ములు
అమరఝరీ స్రోతస్వినులమ్మా !
ఆనందామృత ఫలములు తల్లీ !!
సుధాభాండ మర చేత ధరించిన
అమృతమూర్తి ! ఓ అమృత మనస్విని !
శుద్ధ సత్వమయి ! సువర్ణ రేఖా !
ఎచటి నుండి నీ అవతరణమ్మిట
కే కతమున నా కెరుగ జెప్పుమా !!"

["సావిత్రి" మూలానికి నా స్వేచ్ఛానువాదం.]

పై పంక్తులలో సావిత్రి స్వరూపమూ, ఆమె రహస్యమూ మనకు వ్యక్తమవుతుంది మహర్షి నారదుని ముఖంగా మహర్షి అరవిందులు ఈ మాట లనిపించడం ఓ కవితా చమత్కారం. 'మీ మాటలు మంత్రమ్ములు' అని ప్రవరుడు చెప్పినట్లు పై నారదుని వాక్యాలన్నీ మంత్రారా లని అరవిందుల తాత్పర్యం !

సావిత్రి నరలోకంలో నడుస్తున్నా నరావరణ కవతలి పొలిమేర లలో పృథ్వీకందని భవ్యదృశ్యాలను చూచిందని పై పంక్తులలో వర్ణింపబడివుంది. ఇది అతిమానస సిద్ధాంత ప్రతిపాదనం. పృథ్వీజడం పరిణామావస్థలో ఇది ప్రాణశక్తిగా మారినా ప్రస్తుతానికి పదార్థానికి మానసిక శక్తి లేదు. కాని మనస్సు అట్లా కాదు. సంకల్ప శక్తితో మనస్సును పరికరంగా వాడుకొని "నరావరణ కవతలి పొలిమేరలలో" "పుడమి కనుల కగువడని దృశ్యము"లను చూడవచ్చు. ఇదీ సావిత్రీ మంత్రార్థం. కుండలినీ యోగం !!

ఈ యోగ రహస్యాన్నే నారదుని ముఖంగా ఇలా అనిపిస్తారు అరవిందులు :

"అరుణ కమల పథమందున నీ వొక
ధవళనందివై తాండవించెదవు !
సత్యశుద్ధ సంకల్ప కాంతిలో
శాంతి కపోతమ్మై చరియింతువు"

[నా స్వేచ్ఛానువాదం.]

అరుణ కమలం సహస్రారం ధవళనంది ఊర్ధ్వముఖంగా, సాగే తేజస్సు. ఈమెయే కుండలినీ శక్తి. గాయత్రి – సావిత్రి !!

'సావిత్రి'లో అరవిందులు తాము జీవితంలో చెప్పదలచుకున్న దంతా కూడా అక్షరం అక్షరంలోనూ నిక్షిప్తంచేసి వెళ్లారని భావించ వచ్చు. అందుకే సావిత్రిలోని కవిత్వం ప్రకృతి వర్ణనలు అతిమానస సిద్ధాంతంతోబాటు ఇందలి తంత్రశాస్త్ర రహస్యాలను గూర్చి (శ్రీ చక్రము—మానవ శరీరము) కూడా అప్పుడే పరిశోధన ప్రారంభ మైంది.

"Mind is a mediator divinity
Its powers can undo all nature's work:
Mind can suspend or charge earth's concrete law
Affranchised from earth habits drowsy seal
The leader grip of matter it can break
Indeffeient to the angry stare of Death
It can immortalise a movement's work"

(సావిత్రి 1–5)

ఈ పంక్తులలో శ్రీచక్రంయొక్క తాంత్రిక రహస్యం వుందని కొందరంటున్నారు (అర్క–మే 73 సంచిక 68వ పుట) అయితే ఇందులో అరవిందులు తమ అతిమానస సిద్ధాంతాన్ని స ష్టీకరించారు. దైవానికీ, జగత్తుకూ మధ్య మనస్సు ఒక మధ్యవర్తిట! ఇది ప్రకృతి ధర్మాలనే మార్చివేయగలదట ! పరిమార్చివేయగలదట ! యముని క్రూరదృష్టిని త్రోసిరాజని అల్పజీవనానికి అనంతత్వాన్ని ప్రసాదించే శక్తి ఈ మనస్సుకు ఉంది–అంటారు మహర్షి. ఇది స్పష్టంగా అతిమానస విజయాన్ని వరించడమే కాదా !!

అరవిందులు మృణ్మయమైన మన మధ్య జీవించిన ఒక చిన్మయశక్తి! వేదపురుషుడు!! ఉషస్సును వర్ణిస్తూ ఇలా అంటారు సావిత్రిలో వారు.

"A message from the unknown immortal light
A Blaże upon creation's quevering edge
Dawn built her aura magnificent heres
And buried its seed of grandeur in the hours"

ఈ ఉషస్సు సూర్యకాంతి సావిత్రి మాత్రమే కాదు వేదకాలంనాటి సత్యయుగాన్ని మన మధ్య ప్రసారంచేసిన 'అరవిందో' న్నిలనంకూడా!!

# రాబందులు

కన్నడ మూలం : డి. లింగయ్య

అనువాదం : ఘట్టంరాజు అశ్వత్థనారాయణ

నిన్న రాత్రి సరిగ్గా నిద్రపట్టనందున పొద్దున్న లేవడం బాగా ఆలస్యమయింది కాలకృత్యాలు తీర్చుకునేందుకని అలవాటు ప్రకారంగా కాలువవైపు వెళ్ళాను. బయట ఎండ మలమల మాడ్చేస్తూంది. వెలుతురువైపు చూద్దామంటే వీలుగాకున్నది. మనస్సంతా అల్లకల్లోలంగా వుంది సూర్యునివేడి, వాడి కిరణాలు తగిలి వొళ్ళు చురుక్కుమంటూంది. మనస్సంతా అనూహ్యమైన గాంభీర్యముతో అలముకొని వెలితి నిండుకొని, ఒంటరి తనవు నిస్సహాయత అధికమై, పెద్ద వృత్తం మధ్య గిరగిరా తిరిగే చుక్క జ్ఞప్తికి వచ్చి బిక్కు బిక్కుమనిపించింది. కొన్ని ఆలోచనలు తల తొలుస్తున్నాయి, మేడిపండు నిండా బిలబిల్లాడే పురుగుల్లాగా నా తలనిండా దిగుళ్ళే. నన్ను వెంటాడేవి అపకారం చేయలేని సాధుపురుగులుకావు, శరీరాన్ని తొలచి తినే క్రూరమైన పురుగులు. మేకలు తిని విడిచిన వేపకొమ్మలు ఇంటిముందు కన్పించాయి, వాటిల్లోంచి ఓ చిన్న పుల్లను విరిచి, ఆ పుల్ల కొసను బ్రష్‌లాచేసి, పళ్ళు తోముకుంటూ విశ్వేశ్వరయ్య కాలువ మీదుగా తూము వైపు యాంత్రికంగా నడిచాను.

కాలువలో నిన్నరాత్రే నీళ్ళు నిలిచాయి గుంతల్లో నిలిచిన నీళ్ళలోని చేపలను తినాలని నీటి పక్షులు వెదుకుతున్నాయి. కొంగలు తిరుగుతూనే అక్కడక్కడ చేపలను వేటాడుతున్నాయి. ఎండవేడికి చెట్లు చేమలు సొక్కి వాడిపోయాయి. చాలా ఎత్తులో వృత్తాకారంగా ఆకాశంలో నల్లని చుక్కల్లా గద్దలు తిరుగుతున్నాయి అదే యింకోరోజు అయివుంటే, భావావేశంకలిగిన కవికుమారునిలా ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించే వాడినే. కాని ఈ రోజు ఏమీ కాబట్టలేదు.

హృదయాన్ని బరమాలా లోతుగా......లోతుగా తొలుస్తూ వున్న చింతను పారద్రోలటమే కష్టంగా వుంది. నిన్నరాత్రి సరిగ్గా నిద్రరాకపోవటం నాకేమీ కొత్తకాదు. నిన్నేమిటి ఖర్మ, చదువు ముగించి వూరికి వచ్చినప్పటి నుంచీ ఇదే రామాయణం. ఇంకా చెప్పాలంటే అంతకంటే ముందునుంచే కూడా నా తిప్పలు నేను పడుతూ వుండగా ఇంట్లో వాళ్ళ విపరీత వ్యాఖ్యానాలు వేరే. గోరుచుట్టుపై రోకటి పోటులాగా !

"వాన్కి లగ్నం చేస్తేసరి, అంతా కుదురుకుంటుంది" అని మా వూళ్ళోని వో పెద్ద మనిషి మా అమ్మతో అన్నారట. అమ్మ కూడా ఒకేపట్టు పట్టి కూర్చుంది. "మొగుణ్ని మింగిన ముండను ఎన్నాళ్ళని బతికేది ? నీ తలపై నాల్గింజలు పడేస్తే చాలు, యతా వెతా లేకుండా కండ్లు మూస్తాను చచ్చేటప్పుడైనా నా మాట జరగనియ్యి" అంటూనే వుంటుంది. "నా తలపై గింజలే ఎందుకు, పెద్ద గుండే పడేయ్" అందామా అనేంత కోపం వస్తుందినాకు. కాని కన్నతల్లాయె. చూసిచూసి ఆమె మనస్సు కష్టపెట్టలేను. తల్లి శాపానికి, కుక్కశాపానికీ ఎదురు లేదనే సామెత వుండనేవుంది. నాన్న పోయిన తర్వాత పడరానిపాట్లుపడి నన్ను పెంచి పెద్దచేసింది. కొడుకు బాగా చదువుకొని, గొప్పవాడై తనకేమో వొరిగిస్తాడని కలలు కనింది. ఆమె అలా ఆశలు పెట్టుకోవడమూ సహజమే. కాని నా మనస్సును అర్థం చేసుకొనక పోవటమే ఆమె తప్పు. ఎంత చెప్పినా వింటేనా? బహుశా నా క్షోభ కన్నతల్లికి కూడా అర్థమయ్యేంత సులభంగా లేదేమో !

ఏ సుఖాన్ని పొముకుంటానని తల్లిబలవంతానికి కట్టుబడి పెళ్లి చేసుకొనేది? చదివాను, నిజమే. ఎం. ఏ.. అందులోనూ కన్నడ సాహిత్యంలో. కన్నడ ప్రొఫెసర్ల అనుగ్రహంవల్ల థర్డ్‌క్లాసు వచ్చింది చదివిన వెంటనే—అందులోనూ థర్డ్‌క్లాసుకు ఉద్యోగం దొరుకుతుందనే గ్యారంటి ఏమిటీ? నా దేశంలో చదువనేది ఒక శాపం.

ఎందుకని చదివానురా భగవంతుడా అనిపించింది కన్నడాన్ని వుద్ధరించాలి, కన్నడసేవ చేయాలి అని ఏమేమో ఆశలుపెట్టుకొని, కన్నడోపన్యాసకులంటే సాక్షాత్తు దేవతలని భ్రమించి, కన్నడ ఎం.ఏ.,

చగవాలని వెళ్లాను. నా ఆశలు అడియాసలయ్యాయి నేను ఎవరినైతే నమ్మానో, వారే నా భవిష్యత్తును నాశనం చేసి, ఇక జీవితంలో తలెత్తనీకుండా నన్ను అట్టడుగున తొక్కి వేశారు.

దీనంతటికీ మూలకారణం తేటతెల్లంగావుంది. నేను కన్నడ ఉపన్యాసకుల చెక్కభజన చేసేవాణ్ణికాను. వారికి అడుగడుగు దండాలు పెట్టేవాణ్ణికాను. వారు చెప్పిందంతా నిజమే అని గంగిరెద్దులా తలవూపే వాణ్ణి అసలేకాను. మనస్సుకు నిజమనిపించిన విషయాన్ని కుండబద్దలు కొట్టినట్లు చెప్పేవాణ్ణి మరి, అక్కణ్ణుంచే మొదలైంది కథ. బుద్ధిమంతుడు, కన్నడ సాహిత్యానికి కీర్తితెచ్చేవాడు అంతటివాడు, ఇంతటివాడు అని పొగిడే గురువులు శాపాలివ్వడం మొదలెట్టారు. వేదికలెక్కి వారిచ్చే ఉపదేశాలేమిటి ? వారు చేసే పటాటోపాలేమిటి ? బుద్ధుడు, ఏసుక్రీస్తు, గాంధీ వారి ముందు గడ్డిపోచకంటే హీనం. మిల్టన్, డాంటే, పంప, నారాయణప్ప– వీరిముందు బలాదూర్ ! వీళ్లముందు నిలిచేవారెవరు ? చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష' అనుకొనే జాతి. ఛీ ! నీచపు మనుషులు ! ఒక్కలిగ (కాపు) ను చూస్తే లింగాయతుడు, లింగాయతుణ్ణి చూస్తే వొక్కలిగ, వీళ్లిద్దర్నీ చూస్తే బ్రాహ్మణునికీ సరిపోని స్వభావంగల జాతిరహిత దేశంలోని ప్రజలు ! అందరూ రీడర్, ప్రొఫెసర్, అదికావాలి, యిదికావాలి, చేతినిండా జీతంగీతం రావాలి, కాసుకొరగాని తమ పుస్తకాలు పాఠ్యగ్రంథాలై కనకవర్షం కురిపించాలి. పంప, కుమారవ్యాస, కాళిదాసుల సమాధులమీద బంగళాలు కట్టుకొని ఖుషీ చేయాలని పగలు రాత్రి జపం చేసే మహానుభావులు !

అధ్యాపకుల సత్తా తెలిసింతర్వాత దూరంగా వుండటానికి ప్రయత్నించినప్పుడు వాళ్ల శనిదృష్టి నాపై ప్రసరించింది. అందుకు ఫలితంగా నాకు థర్డ్‌క్లాసు అనుగ్రహించబడింది. నన్ను బతుకనివ్వకుండా, చావనివ్వకుండా త్రిశంకు స్వర్గంలోకి తోసి మీసాలు మెలివేశారు. చదువురాని యింటి వాళ్లకు ఇదేమీ తెలియదు. ఒకవేళ తెలిసిందనుకోండి, " ఈ భాగ్యానికే కన్నడం ఎందుకు చదివావు ?" అని శపీమని అనడానికి వెనుదీయరు. నా హీనస్థితికి కన్నడాన్ని గురి చేయటం ఇష్టంలేదు.

కన్నడం కోసం కష్టపడేవారు వేరే: కన్నడం పేరు చెప్పుకొని పొట్టపోసుకునేవారు వేరే. కన్నడ ప్రొఫెసర్ల అధికార మదంతో ప్రతిభావంతుల జీవితాల్ని నాశనం చేయటం కళ్లారా చూసినప్పుడు నా మనస్సు క్రుంగిపోతుంది; ఈ అన్యాయానికి అంతులేదా అని కలవరపడుతుంది. కన్నడిగులకు ఇతరులవలన కలిగే అన్యాయానికంటే కన్నడిగులవల్లనే జరిగే అన్యాయాన్ని చూసినప్పుడే నా మనస్సు ఎక్కువగా దహించుక పోతుంది. తన సంతానాన్ని తానే తినే పందులకు, ఇలాంటి మనుష్యులకు భేదమేమైనా వుందా అనే ప్రశ్న మొలకెత్తుతుంది. ఇలాంటి అన్యాయాన్ని ఎదుర్కొని, న్యాయం చేకూర్చేలా ప్రయత్నిద్దామనుకునేలోగానే నాకు జరిగిన అన్యాయాన్ని గురించి ఆలోచించినప్పుడు–నేనా నరకయాతన అనుభవించిన సంగతి తల్చుకుంటే ఇప్పుడు విచిత్రమనిపిస్తుంది.

ఎం. ఏ. ఫైనల్ ఇయర్ పరీక్షలు ఒకటి, రెండు నెలలు ఉన్నాయనగా ప్రొఫెసరు నన్ను పిలిపించి, "చూడోయ్ ! నీవు బతికి బట్టకట్టాలంటే నేను చెప్పినట్లు వినాలి. మా బంధువుల వైపు ఓ పిల్లుంది ఆ. .అదే . . ఫలానా వారి తాలూకు. ఆ పిల్లని నీకిప్పించాలని నా ఆశ. ఆ అమ్మాయిని నీవు ఒప్పుకున్నావో నీకు సులభంగా ర్యాంకూవస్తుంది, యూనివర్సిటీలోనే ఉద్యోగమూ ఖాయము మీరిద్దరూ హాయిగా వుండొచ్చు. ఆలోచించుకో. . ." అని అన్నారు.

ఆలోచించాను. బాగా ఆలోచించాను. "ఈయన పాఠాలు చెప్పే ప్రొఫెసరా లేక పెళ్లిళ్లు కుదిర్చే బ్రోకరా" అని. ప్రొఫెసరు చెప్పినట్లు విని, తు. చ తప్పక పాటించి సుఖంగా వుండేవాళ్లను చూశాను. తన స్వార్థం కోసం నన్ను బురదగుంటలోనికి ఈడ్చుకొని పోదలిచే ప్రొఫెసరు నాకు చాలా నికృష్టునిగా కనపడ్డాడు. అయన మాటలు వింటూండగానే బీర్‌బాటిల్ మూత వూడతీయగానే బుస్సని పొంగే నురగలాగా నాలోని తేజం బుసలుకొడుతూ కరిగి కరిగి నీరై పొంగసాగింది. ఈ కూపం లోనించీ బయటపడితే చాలనిపించింది. "క్షమించండి సార్, యీ విషయంలో నన్ను బలవంత పెట్టొద్దండి. నా కిష్టంలేదు" అని చెప్పి వచ్చేశాను వచ్చేటప్పుడు ప్రొఫెసరు నావైపు ఉరిమి ఉరిమి చూడటం గమనించాను. నాకు థర్డ్‌క్లాసు ఇచ్చిన తర్వాత కాని ఆ ఉగ్రనరసింహుని చూపులు చల్లబడలేదు.

ప్రొఫెసరు కలా బదులు చెప్పి బయటికి వచ్చింతర్వాత నా బ్రతుకు కుక్కబ్రతుకైంది క్లాసులో కూర్చున్నప్పుడు, ఆయన మాటలు, చూపులు నన్ను వేధించేవి. ఒక్కో ఉపన్యాసకుడు ఒక్కో

దెయ్యంలా అగపడేవాడు ముందేమవుతుందోననే భీతి నన్ను కాడించేది. ఒకటి రెండుమార్లు ఆత్మహత్య చేసుకుందామనుకున్నాను. ఆత్మహత్య మహాపాపమన్నవాడు మూర్ఖుడేసరి! జన్మనిచ్చి పెంచి పెద్ద చేసిన తలి దండ్రుల కన్నా, చల్లగా కాపాడే దేవునికన్నా, దారినపొయ్యే దానయ్య—నికృష్టమైన ప్రొఫెసరులాంటి మనుష్యులు మా జీవితపు రూపురేఖల్నే మార్చేసే మారణాస్త్రాల్ని పొందివుండటం తల్చుకొనగానే తల గోడకేసి బాదుకొందామనిపించింది. ఇలాంటివాళ్ళు లేకపోతే పగలే పుటదా? లేక వీళు లేని పగలు పగలేకాదా?

ఈ పాడు విషయాలు ఎందుకని జ్ఞాపకమొచ్చాయబ్బా? జ్ఞప్తికి రావడమెందుకు? తల వేడెక్కించటమెందుకు? ఇష్టం వచ్చినట్లు పొడవటమెందుకు?

జ్ఞాపకమే భయంకరం ఆకలి తీరేంతవరకు చిక్కినవాళ్ళను విడిచేది లేదు పొద్దూ గిద్దూ తెలిసేది లేదు. కన్నూ ముక్కూ చూసేది లేదు నొప్పీ గిప్పీ గమనించేది లేదు. పొడిచి గబగబా మింగడ మొక్కటే దానికి తెలుసు. అబ్బా! గుండెల్లో చెప్పలేనంత బాధ! "మీరు చాలా సీరియస్‌గా వుంటారు. మనో వేదన మానుకోవాలి అప్పుడు గాని ఈ నొప్పి తగ్గదు" అన్నాడు డాక్టర్. ఎంతయినా అనుభవజ్ఞుడు. అయినా నా హృదయానికి డాక్టరుకు ఏనాటి అనుబంధమో! ఛస్, పాడు ఆలోచనలు...... ..

నా ఖర్మానికి తోడు నాకో మేనమామ. మా నాన్న చచ్చేటప్పుడు మేనమామతో దేవునిమీద ఒట్టేసి "నీ కూతుర్ని నా కొడుక్కిచ్చి పెళ్లి చెయ్యాలి. పాత బంధుత్వం విడిపోకూడదు" అని అన్నాట్ట. రెండేళ్లనించి మేనమామ ఆ మాటలు జ్ఞాపకంచేస్తూనే వున్నాడు. నేనా పెళ్లికి వొప్పుకోకపోతే నా ముందే ప్రాణాలు విడుస్తాట్ట! ఏమి త్యాగం! మా నాన్న చచ్చేవాడు ఎలాగూ చచ్చాడు, ఇలాంటి వాగ్దానం చేసే చావాలా? ప్రొఫెసర్ చెప్పిన ఆ లంజ . మెల్లకన్ను మేనకోడలు . . .ఇలాంటివాళ్ళకు నేను మొగుణ్ణవాలి. నా అదృష్టాన్ని కిదొక్కటే తక్కువ. ఛూ! వెధవ ఆలోచనలు... నేను లేచిన వేళ మంచిది కాదు. కాదు కాదు నేను పుట్టిన నక్షత్రమే అలాంటిది. లేకపోతే ఇలా ఎందుకు తెల్లవారుతుంది? పాడు ఆలోచనలు అన్నీ జ్ఞాపకమొస్తున్నాయి. ఏ రోజు జరిగిన ఘటనలు ఆ రోజే మరిచిపోయేటట్లయితే ఎంత బాగుంటుంది? నేను బతికున్నంతవరకు నన్నిని విడువవు. వీటికి నేనంటే అంత ప్రీతి దరిద్రపుగొట్టువి......! వేపరసం కంటే చేదు; సూర్యరశ్మి కంటే వేడి రండి, రండి. ఇలాగో మీ చేతుల్లో చిక్కాను మీ యిష్టాను సారం దాడి చెయ్యండి. ఇష్టం వచ్చినట్లు పొడిచి పొడిచి తృప్తి చెందండి. ....

కాని అబ్బా గుండె పిండినట వుతున్నది......

నోట్లో నిండుకొన్న వేపరసం వుమ్మివేసి, ఆకాశంవైపు దృష్టి సారించినప్పుడు, శత్రువుమీద దుమికే జెట్ ఫైటర్‌లాగా ఒక గద్ద కటింగ్‌వైపు వాలడం చూసి నాకు ఆశ్చర్యమూ, కుతూహలమూ ఒకేమారుకలిగాయి. గద్ద ఎందుకు వాలింది? ఎందుకో... ఎలాగూ అక్కడికే పోతున్నా కదా, చూస్తే సరిపోతుంది. శెట్టి కొడుకు కాలుజారి పడ్డా, గద్ద నేల వాలినా విశేషముండనే వుంటుంది. కటింగ్ మా వూరికి సుమారు అర్ధ మైలు వుంటుంది. అక్కడ దయ్యాలుంటాయనే భయంవల్ల సాధారణంగా ఎవ్వరూ వొంటరిగా అవైపు పోరు. పల్లెలో వున్నప్పుడు నేను ప్రతి రోజూ తప్పకుండా అక్కడికి పొయ్యేవాణ్ణి. అక్కడి నిర్జన, ప్రశాంత వాతావరణం నాకెంతో నచ్చింది. ఈ పాడు లోకంకంటే ఆ శూన్యమే మేలు.

కటింగ్ దగ్గరయ్యేకొద్దీ, ఆకాశంనించీ క్రిందికి వాలే గద్దల సంఖ్య ఎక్కువ కాసాగింది. కటింగ్ మధ్యనించీ రాబందుల క్రయ్... క్రయ్ మనే శబ్దం వినపడసాగింది. కాకులు కావు కావు మంటున్నాయి. గబగబా నడిచి కటింగ్ దగ్గరకు పోయి చూస్తే వింత ప్రపంచమే చూసినట్లయింది రాబందులు, గద్దలు, కాకులు ఒక్కుమ్మడిగా గోలచేస్తూ దేన్నో చుట్టుముట్టాయి. కటింగ్ లోపలికి తొంగిచూస్తే తెల్లని శరీరం కనపడింది.

నా తలపోటు మరింత ఎక్కువైంది.

అది స్త్రీ శరీరం. ఆ స్త్రీ శరీరం ఏ కారణంగానో నీళ్ల పాలయి తేలివస్తూ, నిన్న కాలువలో నీళ్ళు నిలిచినందువల్ల కటింగ్ దగ్గరున్న పెద్ద బండకు తగిలి, ఆగిపోయింది. ఇరవై ఏళ్ల ప్రాయం లోని ఆ యువతి దేహం పూర్తి నగ్నంగా ఉంది. ఇప్పుడేమో ఆ దేహం ఉబ్బివున్నా, బతికి వున్నప్పుడు అందంగానే వుండి వుండాలి. నీళ్ళపైన ముఖభాగం కనపడుతూ చూడటానికి భయంకరంగా వుంది.

ఇంత చిన్నవయసులోనే మృత్యువు వాతబడి, రాబందులకు ఆహారమయివున్న ఆ శవాన్ని చూడగానే నాకెక్కడలేని బాధ కలిగింది. ఆ శవాన్ని చూస్తున్నట్లుగానే నిశ్శక్తి ఎక్కువై, ముందుకు నడవ

లేక, తల తిరిగినటయి అక్కడే బండమీద చతికిలపడాను. నిర్మాన ప్రదేశం. మలమల మాడ్చేఎండ. నరనరాలను వణికించేలా రాబందుల వికారమైన అరుపులు, రెక్కల చప్పుళ్ళు, ఎగరటాలు......వీటి మధ్య దిగ్భ్రమ చెంది శవాన్ని చూస్తూ వుండిపోయాను.

రాబందులు ఆనందంగా వజ్ర ముంచువులతో శవం కళ్ళు, గుండె, కడుపు మొదలైన మెత్తని భాగాలను పొడిచి పొడిచి మాంసాన్ని రుచి చూస్తున్నాయి రాబందుల కళ్ళు తప్పించి మధ్య మధ్య గద్దలు, కాకులు శవాన్ని తింటున్నాయి. పాపం! ఆ శవం రాబందులు లాగినవైపెల్లా జరుగుతూ, పొడిచినవైపెల్లా సహిస్తూ బీభత్సంగా తయారయింది.

రాబందులు ముట్టడించిన శవం. బ్రతికి వున్నప్పుడు ఆ దేహాన్ని ఎవరెవరు ఏయే విధంగా పీక్కు తిన్నారో; ఏయే విధంగా గొడ్డు చాకిరీ చేయించుకున్నారో ఎన్నెన్ని విధాల రాచి రంపాన పెట్టారో, చచ్చిన తర్వాత కూడ రాబందుల పోరు తప్పలేదు. బ్రతికి వున్నప్పుడు మనుష్యులు, చచ్చిన తర్వాత రాబందులు తినే ప్రాణులు వేరైనా పని వొక్కటే. మనుష్యులు ... రాబందులు, రాబందులు ... మనుష్యులు.

ఒక్క దేహంపైన ఎన్ని రాబందులు!!

కన్నడిగులు...ప్రొఫెసర్... లంజ ... అమ్మ ... నాన్న ... మేనమామ...మెల్లకన్ను మేనకోడలు . డిగ్రీ...ఉద్యోగం జీవితం . అందరూ...అందరూ...తొలగండి తొలగండి, నన్నొదిలిపెట్టండి!! నన్ను ఊపిరి పీల్చుకోనివ్వండి, బతుకనివ్వండి ... తొలగండి ... తొలగండి...

కటింగ్ పక్కన కూర్చున్న చోటనే పిచ్చిపట్టినవాని వలె బిగ్గరగా అరిచి విదావంగా ఈ లోకంలోకి వచ్చిన తర్వాత నలు దిక్కులా చూచి శవంవైపు తిరిగినప్పుడు...అస్థిపంజరం మాత్రమే కనపడింది. మధ్యాహ్నపు ఎండ మలమల మాడ్చేస్తున్నది. రాబందుల గుంపు మునుపటికంటె పెద్దదయింది. రాబందులు ... బ్రతికివున్నప్పుడు...చచ్చిన తర్వాత...నలువైపులా...ఎక్కడ చూచినా రాబందులు...

రాబందులు ఒకదానితో మరొకటి కొట్లాడుతూ, వికృతంగా అరుస్తూ, పాతాళంనుంచీ వచ్చే పిశాచాల్లా కాలువలోనుంచి పైపైకి వస్తున్నాయి. చూస్తుండగానే వొంటరిగా వున్న నన్ను అన్నివైపులా ముట్టడించాయి రెప్పపాటుకాలంలో తలలో ఏవేవో ఆలోచనలు పుట్టి మునిగిపొయ్యాయి. వాంతి కలిగేలా అయి కళ్ళు బైర్లుక్రమ్మాయి. గుండె మండుతున్నది తల బద్దలవుతున్నది. రాబందుల క్రేయ్ క్రూయ్ మనే అరపులతో చెవులు గింగురుమంటున్నాయి. లేచేందుకు చేతకావటం లేదు. అటూ ఇటూ ఎగిరి రాబందువొకటి నా పాదాన్ని చటుక్కున పొడిచేసింది. భరింపనలవిగాని బాధతో దిగ్భ్రమ కలిగింది. గుండె ఆగిపోయినట్లయింది. ఒంటోని శక్తినంతా కూడగట్టుకొని గట్టిగా అరచాను: తొలగండి రాబందులారా తొలగండి...

తొలగండి.... తొ .... ల ...., గం .... డీ ....."



# అశాంతినుండి

శ్రీ మాదిరాజు రంగారావు

ఆగింది ఆలోచన
పెద్ద బండ వద్ద
ఒక్క క్షణం తడుముకొనే
ప్రవాహ తరంగం వలె.

ఎగసింది ఆలోచన
చిన్ని గుండె నుండి
ఒక్క క్షణంలో ఎగసే
నెత్తురు అలవలె.

లేదు భయం, భయం లేదు
దొరలనీ సముద్రంపై నుండి
పడనీ ఆకాశం విరిగిపైన
భయం లేదు, లేదు భయం.
తిరుగనీ కల్లోల వలయాలు
నడవనీ ఉద్రేక శిఖరాలు
నిలుస్తుంది శక్తివంతమైంద
ప్రసరిస్తూ జీవితంలో
బ్రతుకుతుంది ప్రాణవంతమైంది.
వెలుగుతూ సమాజంలో.
ఒక్క త్రుటిలో
దగ్ధమయ్యేది కాదు. ఈ అడవి.
ఒక్క వ్రేటులో
కూలిపోయేది కాదు, పర్వతపంక్తి,
అడవిలో పర్వత శ్రేణుల్లో
తిండికై గుడ్డకై నీటికై

నినదించే జనసందోహం
నీ చూపునుండి తప్పిన వలయం,
ప్రసరించనీ ఎక్స్ కిరణం
చీకట్లు దూకిన మనస్సుల్లోకి
బ్రతుకులు జారిన లోయల్లోకి,

తేవలసి ఉందీ స్ఫులింగాల్లో
మరణ దండం కాదు. అనురాగం,
రావలసి ఉందీ వీరిలో
ప్రతీకార విడంబనం కాదు, సహ
తృప్తి రేఖా సంచారంతో
కదలే అనుభవ ప్రవాహం !

ఇంతకాలం పెదవులపై
పిట్టలవలె ఎగిరే మాటలు
ఇంతకాలం మనస్సులో
నెమళ్ళవలె ఆడే ఊహలు
ఇపుడవుతున్నాయి, తుపాకి గుండ
ఇపుడవుతున్నాయి, వైప్లవాస్త్ర

కదులుతూంది జనసమూహం
విరామం లేని మహా యంత్రం
తన గొడవే ఒక సంగీతంగా.
చూపుకి కన్పిస్తూనే ఉన్నాయి
దూరాన తిరిగె గోళాలు
చెవులు వింటూనే ఉన్నాయి
గుండెలు ప్రేలే ధ్వనులు !

ముడి వీడిన మూటనుండి
జారిపోయే వ్యథతో
దోసిలి నిండిన కన్నీటిని
చెదరగొట్టే ఊర్పులతో
సాగిపోతోంది గాలి
విరామంలేని రొదతో,

ఎగసిన స్ఫులింగం ఇంతలో
నిశ్శబ్దాన్ని కౌగిలించుకొని
చల్లదనంతో బొగ్గైన వార్త
అంతటా వ్యాపించింది వెలుగై
జరజరా ప్రాకుతూ త్రాచై,

ఇంతకాలం అతణ్ణి క్రమ్మిన
నీడ తొలగింది నిర్భయంగా
అతని జేబులు గాలిస్తే
దొరికాయి పోలీసుల కందులో
సిగరెట్ ముక్కలూ చిల్లర డబ్బులూ,

పొగలు సాగే కళ్ళతో
నిప్పులురలే ముఖంతో
కూలిపోతూన్న అతడు
నిలిపిన ప్రశ్న ఆలాగే ఉంది,

కార్లు రొదచేస్తూనే ఉన్నాయి
మేడలు మిన్ను చూస్తూనే ఉన్నాయి
వార్త విన్న సామాన్యుని కళ్ళకు
కన్పిస్తోంది రక్త సిక్త గగనం.

అతని రూపం
కదలుతోంది సంధ్యలో
అతని నీడ
ప్రతిఫలిస్తోంది నీటిలో.
అతని స్వరం
ఎగురుతోంది పక్షియై
అతని హృదయం
స్పందిస్తోంది పెనుబండలో
మానవ శ్రేయో భూమికలో
ఇత డొక విప్లవ గోళం
ఇది ప్రసరించినంతమేర
భవిష్యత్తు రక్తతోరణం.



ఎన్ని సమయాలలోనో
చరిత్రను సృజించిన శాంతి
ఒకప్పుడు కోరుతుంది
తన మనుగడకై అశాంతి.

కొన్ని క్షణాలు కదలక తప్పవు
పర్జన్ చేతిలో శస్త్రంవలె
ఇది తుది లేకుండా సాగే
స్థితి ఎన్నటికీ కాకూడదు.
ఎంతసేపు చేస్తుంది నృత్యం
పట్టరాని అశాంతితో కాలం



దిగ్మండలమైన అవనీఖండం
అణువణువూ తపిస్తూంది
క్రొత్త సృష్టికోసం !
అనుభవిస్తూ ఎదలో
స్పందించే కారుణ్యం

ఆరోగిస్తూ నదిలో
నిల్పుకొని మానవత్వం

సాగనీ వెలుగు స్వేచ్ఛగా
అన్ని దిశలనుండీ
రానీ గాలి నిర్నిరోదంగా
అన్ని వైపులనుండీ,
సాగనీ మనసులో
పయోద సంచారం !

ధైర్యం పందిరివేసిన
వదన సీమపై ప్రాకే
ఆ శాంతిని పూయనీ
క్లిష్టమైన ఈ సమయం.

చేరనీ ఎదురై మృత్యువు
పోనీకు నీనుండి
ఉదార గుణ వర్తనతో
పల్లవించిన శ్రేయోరూపం.

ఎదురై వస్తుంది కాలం
శాంతమైన తేజంతో
శ్యామాయమాన భవిష్యత్తుతో
విశ్వమానవ ప్రతిబింబంతో

ఒక్కక్షణం ఆగిన ఆలోచన
కదలింది ప్రవాహమై,
క్షణంలో ఎగసిన ఆలోచన,
తరలింది వెలుగు వరదై.

వస్తుందీ చీకటి చాటునుండి
రోజా వచ్చే సూర్యునిరూపం,
కల్యాణ మనోజ్ఞంగా ఈనాడు...
శాంతి నిండిన తేజంతో !

దారిద్ర్యం భయంలేని
స్వేచ్ఛా నవసంస్కృతికి
కదలనీ, తరలనీ
మేల్కొన్న ఈ సమయం.

---



# మానవల్లి కవి రచనలు

**శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య**

ఉడికీ ఉడకని మెతుకులు నాలుగు గతికి, ఉతికిన చొక్కాను ఒంటి మీద తగిలించుకొని, అతి నిరాడంబరంగా, తిన్నగా ఆఫీసుకు నడుచుకొంటూ పోయే అదే మూర్తి యిప్పటికీ నా కళ్ళముందు సాక్షాత్కరిస్తుంది. ఆ మూర్తి ఎవరోకాదు. మానవల్లి రామకృష్ణ కవి ఎన్నో అపూర్వమైన పూర్వకవుల కావ్యాలను కాలగర్భంలో కలిసిపోకుండా వెలికితీసి, వ్యయప్రయాసలకు లెక్క చెయ్యకుండా అతి కష్టంమీద వాటిని ముద్రించి ప్రకటించిన మహాపండితుడు ఆయన. తాళపత్ర గవేషణ ప్రయత్నంలో ఊరూరూ. వాడవాడా తిరిగి ఎన్నో అపూర్వ గ్రంథాలను సంపాదించి సాహితీ లోకానికి ఎరుక పరిచిన కీర్తి ఆయనది. ఒక్క తెలుగులో మాత్రమేకాక సంస్కృత భాషలో కూడా విశేష పరిశ్రమచేసి తమ అపూర్వ గ్రంథాల ప్రచురణలద్వారా దేశంలోనే కాక విదేశాలలోనూ గొప్ప సంస్కృత భాషా పరిశోధకుడుగా, పరిష్కర్తగా ప్రసిద్ధి చెందిన మహామనీషి ఆయన. ఇలా సంస్కృతాంధ్రాలలోనేకాక తమిళ, కన్నడ భాషలలోనూ, ప్రాకృత భాషలోనూ కూడా ఆయనకు మంచి ప్రవేశం ఉంది. ముఖ్యంగా తెలుగులో వారే గనక ఆ రోజుల్లో ఆ యా గ్రంథాలను సంపాదించి ప్రకటించి ఉండకపోతే వాటిని గూర్చిన ఎరుక మనకు యెప్పటికీ అందకుండానే పోయిఉండేది. ఆధునిక యుగకర్తలు వీరేశలింగం పంతులుగారూ, పండిత ప్రభాకరులు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారూ మొదలయిన భాషా విద్వాంసులకేకాక, జయస్వాల్, మైకేల్ విల్సన్ మొదలయిన భాషా విద్వాంసులకు కూడా అచ్చెరుపు కొలిపిన, మార్గదర్శకము అయిన భాషాకృషి వారిది. వారి గొప్పతనానికి సంబంధించిన ఈ విషయమంతా ఇతరులు ఎవరైనా చెబితే తెలియాల్సిందే. నిరాడంబరులయిన, నిరీహులయిన వారి మూర్తిని చూచినప్పుడు వారిలో ఎంత గొప్పతనం, ఎంత పాండిత్యం ఇమిడి ఉందో ఇతరులు చెబితేతప్ప తెలియదు. ఆయన పరిశోధకుడు మాత్రమే కాదు. కవి కూడా. మృగావతి మొదలయిన మధురము లయిన కావ్యాలను తెలుగులో రచించారు. భాసుని సంస్కృత నాటకాలను అవి ప్రకటింప బడక పూర్వమే తెలుగులోకి అనువదించి క్రమంగా ప్రకటించాలని సంకల్పించి కొన్నిటిని ప్రకటించారు. ఆంధ్ర సాహిత్యచరిత్రల్లో వారి పేరూ, వారి కృషికూడా తప్పకుండా ఎక్కడో ఒకచోట స్మరించి తీరవలసిందే—అన్నంతగా వారికృషి పరివ్యాప్తమయి ఉంది. ఇంతటి మహాపండితుడు అయినా ఆయన కొంతవరకూ దురదృష్టజాతకుడు. ఆ దురదృష్టం తెలుగుదేశంలో పుట్టడమే. మరో దేశం, మరోదేశం అయిఉంటే వారి కృషికి బ్రహ్మరథంపట్టి నివాళులు అర్పించేవారు. జీవితచరమదశలో వారు తిరుపతిలో అనుభవించిన గ్రాసవాసోదైన్యమే దీనికి నిదర్శనం. అమూల్యములయిన వారి రచనలు అయినా మళ్లీ ప్రచురితములు అయ్యే అదృష్టానికి నోచుకోలేదు. 'సంవత్సరాది సంచిక', భారతి మొదలయిన పత్రికలలో వారు ప్రచురించిన వ్యాసాలు చెల్లాచెదరులుగానే ఉండిపోయినాయి. ఆయన ప్రకటించిన ప్రాచీన కవిగ్రంథాలు కొన్ని మళ్లీ ఇతరుల పరిష్కరణతో ప్రకటితములు అయినా వారు తొలుత వాటికి రచించిన పీఠికలూ, అందులో వారు తెలిపిన అమూల్యములయిన విషయాలూ జిజ్ఞాసువులకూ, భాషాపరిశీలకులకూ లభించే అవకాశం లేకపోయింది. విస్మృతకవులపేరుతో విస్మృతులయిన అనేక ప్రాచీనకవులను గురించి అమూల్యము లయిన అనేక విషయాలను తెలిపిన ఆయన పేరూ, కృషీ విస్మరింపబడే ప్రమాదమూ, పరిస్థితీ యేర్పడింది. ఇలాంటి స్థితిలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు శ్రీ మానవల్లి కవి గారి అమూల్య రచనలు అన్నింటినీ ఒకచోట సంధానింపచేసి ప్రకటించడం చాలా హర్షింపదగిన విషయం. అకాడమీవారు ప్రకటించిన ఈసంపుటం—వారు పూర్వ కావ్యాలకు రచించిన పీఠికలూ, పుష్పాంజలి పేరుతో వారు రచించిన వివిధవ్యాసాలూ, వివిధ పత్రికలలో ప్రకటింపబడిన ఇంకా మరికొన్ని వ్యాసాలూ, వారి కవితలూ—ఇలా నాలుగు భాగాలుగా కూర్చి ప్రకటింపబడింది. ఈ సంకలనానికి

---

* సంపాదకులు. 'విద్యారత్న' శ్రీ నిడుదవోలు వేంకటకృష్ణారావు, డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావు., ప్రచురణ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు, పుటలు. డెమీ సైజు 90 + 555., వెల. పన్నెండు రూపాయలు.

మకుటాయమానంగా శ్రీ మానవల్లి కవిగారి జీవితంతోనూ, సాహిత్య జీవితంతోనూ చాలా సన్నిహితసంబంధం కలిగిన 'విద్యారత్న' శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు వారి జీవిత విశేషాలతో సమన్వయం చేసిన వారి భాషాకృషిని సమీక్షిస్తూ, నేటివారికి తెలియని అనేక అపూర్వాంశాలను వెల్లడిస్తూ ఒక చక్కని పీఠికను వెలయించారు. డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావుగారు కవిగారి జీవిత చరమదశలో వారికి అనేక విధాలుగా తోడ్పడినవారు. 'నే నెరిగిన మానవల్లి రామకృష్ణ కవి' అని వారు రచించిన వ్యాసం ఈ సంకలనంతో పునర్ముద్రింపబడింది. మానవల్లి కవిగారిని గురించి అధికారికంగా, ప్రామాణికంగా తెలుపగల వ్యక్తులు నాకు తెలిసినంతవరకూ డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్యగారూ, శ్రీ నిడదవోలు వెంకటరావుగారూ మాత్రమే కవిగారికీ, ని. వెం. గారికీ ఉన్న సంబంధం అల్పకాలిక మయిందీ, తక్కువదీకాదు. నిన్న మొన్నటిది అంతకంటే కాదు. అది వెంకటరావుగారి తండ్రిగారు శ్రీ సుందరంపంతులుగారి కాలంనుండీ సాగుతూవచ్చిన సంబంధం. తాళపత్రగ్రంధ సేకరణలో సుందరం పంతులుగారు మానవల్లి కవిగారికి ఆద్యులూ, ఆచార్యులూ. అయితే పరిశోధన పరిష్కరణలలో కవిగారు వెంకటరావుగారికి ఆదర్శప్రాయులు. వారి సాహిత్యజీవితంతో చాలా సన్నిహితమయిన సంబంధమూ, వారికృషిమీద ఆరాధనాభావమూ కలవారు. అందుచేతే వారి జీవిత విశేషాలనూ, ఇతర విశేషాలనూ వారి కృషి మౌలికతనూ, మాన్యతనూ తెలపడానికి వారికంటే సమర్థులు నేడు ఎవరూ లేరనడం.

మానవల్లి కవిగారి జీవితాదిక విశేషాలను గురించీ, వారి పరిశోధన మౌలికతను గురించి తమ పీఠికలో కూలంకషంగా చర్చించిన శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు ఒకటి రెండు ముఖ్యవిషయాలను తమ పీఠికలో ప్రస్తావించకపోవడం చాలా దురదృష్టం. కు. సం. మొదటి రెండు సంపుటాలకూ చివర వారు సమకూర్చిన లఘుటీకల్లో తమిళ కన్నడ గ్రంధాలనుండి సజాతీయములయిన పదాలనూ పోలిక పద్యాలనూ, భావాలనూ ఎత్తిచూపి వారు తెలుగు సాహిత్య పరసంతో తెలుగులో పాండిత్యం పూర్తికాదనీ, అది సమగ్రమైనదీ, సంపూర్ణమైనదీ కావాలంటే సంస్కృతంతోనూ, ఇతర ద్రావిడ భాషా సాహిత్యాలతోనూ మంచి పరిచయం ఉండాలనీ వారు వాచ్యంగా కాక తమ రచనలద్వారా పరోక్షంగా తెలియజేశారు. తరువాత శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు మదరాసు విశ్వవిద్యాలయ ప్రచురణకు వ్రాసిన పీఠికలో కన్నడ గ్రంధాలను పరిశీలించి అనేక నూతనాంశాలు తెలపడానికి మానవల్లి కవిగారు తమ లఘుటీకలతో చేసిన సూచనలే కారణమంటే అతిశయోక్తికాదు. దరిమిలా వర్ధిల్లిన దక్షిణ దేశభాషల తులనాత్మక అధ్యయనానికి కూడా వారు ఇలా మూలపురుషులు అయ్యారు.

మరొక విషయంలో కూడా వారే ఆద్యులు. 1914 లో కు. సం. ద్వితీయ భాగం ప్రకటించే నాటికి తెలుగులో భాషాశాస్త్రం

అంతగా అభినందన పొందలేదు. అలాంటి రోజుల్లో వారు భాషాశాస్త్ర దృష్టితో సంప్రదాయ వ్యాకరణాలకు భిన్నంగా 'పాచీన శబ్దానుశాసన క్రమము' అనే పేరుతో సూత్రరూపంలో ఒక లఘువ్యాకరణాన్ని రచించి ఉండడం వారి విశాలదృష్టికీ, దూరదృష్టికీ నిదర్శనం అవుతుంది.

క. వ్యవహారావారాదుల నవ
నవతయ కోరు నూత్న నాగరకులు నీ
నవసూత్ర ప్రాచీనాం
ధ్ర వచో వ్యాకరణ మెంత నర్వించు నొకో.

కుమా. ద్వితీ. పు 13

అంటూవారు అలవోకగా నవ్యుటాలకని రచించిన ఆ లఘువ్యాకరణం అనేక అమూల్యములయిన భాషావిశేషాలను తెలుపుతూ భాషాశాస్త్ర విషయకంగా కూడా వారు చేసిన కృషికీ, వారి ముందుచూపుకూ దర్పణంగా ఉన్నది. వారే అన్నట్లు అది పాచీన భాషకు వారు రచించిన కొత్త వ్యాకరణం వారిలాంటి దీక్ష నేటి విద్వాంసులకు కూడా ఉంటే నేడు చలామణిలో ఉన్న శిష్టవ్యవహారానికి కూడా ఒక వ్యాకరణం రచించకోవడం యేమంత కష్టం కాదనిపిస్తుంది.

*కుమారసంభవం-వ్రాతప్రతులు :*

కు. సం. వ్రాతప్రతులనుగురించి వ్రాస్తూ శ్రీ వేంకటరావుగారు '1914 లో కవిగారు రెండవభాగప్రచురణమున కొన్ని పాఠభేదములను సూచించిరి. ఆ ప్రతి ద్రవిడదేశమునందు దొరకినదని వారు చెప్పిరి. ఆనాటినుండి దీని మూల పతి తంజావూరి గ్రంధాలయములో తప్పకయుండి యుండునని తేలివది'— అని వ్రాశారు. కానీ నిజానికి తంజావూరిలో దీని మూలప్రతి ఉన్నట్లు మొదట తెలిపింది ప్రభాకరశాస్త్రిగారే. వారు ప్రబంధరత్నావళి పీఠికలో ఈ విషయం తెలిపారు. కవిగారు 1914 లో తంజావూరి ప్రతిలోని పాఠాలనే కొన్నింటిని తమ గ్రంథంచివర ప్రదర్శించడం జరిగింది. నిఘంటు కార్యస్థానానికి పిఠాపురం మహారాజావారి ఆదేశం మీద శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారిచేత వ్రాయించి తెప్పించిన ప్రతి ఒకటి ఉండేదని వేంకటరావుగారు రాశారు. నడకుదుటి వీరరాజుగారు, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, నిఘంటు కార్యాలయ పండితులు, శ్రీ విడుదవోలు వేంకటరావుగారు సూర్యారావుగారు వ్రాసి తెచ్చిన వ్రాతప్రతినే ఆధారంగా గ్రహించారట. 'ఈప్రతి ఇప్పుడు లభ్యంకాదు' అని వ్రాసిన వ్రాతమాత్రం చాలా విచారం కలిగిస్తుంది. ఎవరో ప్రబుద్ధులు ఆ గ్రంధాలయంనుండి దాన్ని తస్కరించి ఉంటారన్నమాట. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు శ్రీ తిరుమల రామచంద్రగారిచేత తంజావూరిప్రతికి మక్కికి మక్కిగా వ్రాయించి తెప్పించినప్రతి ఒకటి వారి కుమారులు డా. వేటూరి ఆనందమూర్తిగారిదగ్గర ఇప్పటికీఉంది. డా. నేలటూరి వెంకటరమణయ్యగారుకూడా ఒక ప్రతిని తమ సొంతమునకై వ్రాయించి తెప్పించుకున్నారట. ఇక శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు విశ్వవిద్యాలయ ప్రచురణకోసమూ, వావిళ్ల వారి ప్రచురణకోసమూ తంజావూరుకు పోయి మూలప్రతితో సరిచూచి వ్రాసి తెచ్చుకొన్న పాఠభేదాలతాలూకు వ్రాతప్రతి ఒకటి వావిళ్ల వారిచ్చింది నాదగ్గరఉంది. వేంకటరావుగారి దగ్గరకూడా ఒక నకలుప్రతి ఉన్నట్లు వారు తెలుపుతున్నారు. ఇలా కు. సం. గురించి పరిశ్రమ చెయ్యదలచుకొన్నవారంతా తంజావూరు ప్రతికి నకళ్లు వ్రాయించి ఉంచుకున్నారని తెలుస్తుంది. నడకుదుటి వీరరాజుగారు మూలప్రతికి నకలయిన వ్రాతప్రతి ఆధారంతో కవిగారి ముద్రిత ప్రతిలో కొన్ని సంస్కరణములు, పాఠభేదములు సూచిస్తూ ఒక లఘుటిప్పణి వ్రాసినట్లుకూడా వేంకటరావుగారు తెలుపుతున్నారు (పుట 18). ఆ లఘుటిప్పణి స్వరూపం ఎలాటిదో మనకు తెలియదు. అక్కడక్కడా వారికి తోచిన సవరణల తాలూకు నోట్సుగా ఉంటుందని ఊహిస్తున్నాను. అలాకాక అది లఘుటీకే అయితే అవశ్యం ప్రచురింపదగింది.

21 వ పుటలో బద్దెన నీతిసారముక్తావళిని గురించి వ్రాస్తూ అధోజ్ఞాపికలో 'దీనిలోని కొన్ని విశేషములను నా తెలుగు కవుల చరిత్ర తిక్కన—ఎఱ్ఱనయుగమున నిచ్చితిని. అది అముద్రితము' అని వ్రాశారు. అముద్రితమైన గ్రంథములో వారు విశేషములను తెలిపియుండుట ఎవరికి ఉపయోగకరమో తెలియదు. ముద్రిత గ్రంథమునైతే పరిశీలించడానికి వీలవుతుందిగాని అముద్రితగ్రంథం పరిశీలించడానికి ఎవరికి సాధ్యమవుతుంది? అలాంటప్పుడు ఆవిషయం పేర్కొనకుండానే ఉండవలసింది. లేదా ఆ విశేషములేవో సంగ్రహంగానైనా అక్కడే తెలిపి ఉండవలసింది. ఇందుచేత తెలిందేమంటే ఆ అధోజ్ఞాపిక నిష్ప్రయోజనము. వ్యర్థము- అని.

పీఠిక 12వ పుటలో శ్రీ వేంకటరావుగారు విస్మృత కవుల గ్రంథప్రకటన కాల కమమును కవిగారి రచనల ఆధారంతో నిర్ణయించి ప్రదర్శించారు. వాటిలో పరతత్త్వ రసాయనమునకూ, అనర్ఘరాఘవమునకూ వారిచ్చిన ప్రకటనకాలం (1911) కేవలంఊహ

మీగ ఆధారమేదే 1912లో వారు ప్రకటించిన శ్రీరంగ మాహాత్మ్యం చివర చేర్చబడిన ప్రకటనలో ఆ రెండు గ్రంథాలకూ వెలయు తెలుపబడి ఉండడమే వారి ఊహకు ఆధారం కానీ ఆ తరువాత పీఠిక 21వ పుటలోనూ, 22వ పుటలోనూ ఆ రెండు గ్రంథాలను గురించి తెలుపుతూ వారు ప్రచురించిన ఆ గ్రంథాలు లభించడం లేదని వ్రాశారు. శ్రీరంగమాహాత్మ్యం చివర ఆచ్చులోఉన్న గ్రంథాలు అని కవిగారు పేర్కొన్న ఆరుగ్రంథాలు ఎలా కవిగారు ఎప్పటికీ ముద్రించలేదో, అలాగే సరతత్త్వ రసాయన అనర్ఘ రాఘవములను కూడా వారు తరువాత ప్రకటిద్దామనే సంకల్పంతో వాటిని ముద్రించ కుండానే-వ్యాపార దృష్టి తో వాటి వెలలు మాత్రం తెల్పిసి ఉండ వచ్చు ఇగి సభావ్యమే కాని అసంభావ్యమేమీ కాదు అందువేతే 1944లో మదరాసు విశ్వవిద్యాలయంవారు పరతత్త్వ రసాయనాన్ని ప్రకటించినప్పుడు కవిగారి ముద్రణ ప్రతిసంగతి ఎత్తుకోలేదు, వారు ప్రకటించి ఉంటేకదా ఎత్తుకోవడానికి. అనర్ఘరాఘవం సంగతి కూడా సరిగ్గా యిలాంటిదే అది కూడా లభ్యం కాకుండా పోవడానికి వారు దాన్ని ప్రకటించకపోవడమే కారణం. నేను ఇంతకుముందు శ్రీ ముచ్చేవి సదాశివరెడ్డిగారు నాకు యిచ్చి నట్టుగా పేర్కొన్న వ్రాతప్రతి యీ గ్రంథమే. బహుశా తాము దాన్ని సంపాదించిన కొత్త లో ప్రకటింపదలచి పాఠకుల్లో కుతూహ లమూ, ఆసక్తి కలిగించడానికి అది ప్రకటితమైనట్టుగానే వెలలో బాటు ప్రకటన చేసియుండవచ్చు 'అనర్ఘరాఘవము ఈ తరువాత తిరిగీ ముద్రితము అయినదే అయినను దీనిని గూర్చి సాహిత్య ప్రపంచ మునకు అంతగా తెలియదనియే చెప్పవచ్చును'— వారు అది ఎవరిచేత యెప్పుడు ముద్రితమైందో పాఠకులకు తెలియజెయ్యవలసిన, ధర్మం శ్రీ వెంకటరావుగారిది ఉంది పై గ్రంథ ప్రకటన కాలక్రమంలోనే ప్రబంధమణిభూషణం 1910లో ప్రకటింపబడినట్లు వెంకటరావు గారు తెలిపారు. కానీ దాని పీఠికలో అది 1911లో ముద్రిత మయి నట్లు తెలుపబడి యుంది అలగే శ్రీరంగమాహాత్మ్యం 1912లో ప్రకటితమయిందని పేర్కొని ఉన్నారు దాని గురించి వ్రాస్తూ 22వ పుటలో 'ఈ ప్రశస్త ప్రబంధము ముద్రితమయి 58 ఏండ్లు యినను నేటివరకుగాని తిరిగి ముద్రితము కాలేదు. విపుల పీఠికాదు లతో పునర్ముద్రణము కాదగినది' అంటూ వ్రాశారు కానీ గ్రంథ భాగంలో ప్రకటింపబడిన శ్రీరంగమాహాత్మ్యం పీఠికలో (చూ 125 పుట) 1929లో ఇది పునర్ముద్రణం పొందినట్లు తెలుప డి యున్నది. అందులోనే అద్జ్ఞాపికలో ప్రథమ ముద్రణము 1912 లోనే వెలువడినది (చెన్నపురి 5 జూన్ 1912) అని యిచ్చి యున్నారు. 1929లో ప్రకటించిన ద్వితీయ ముద్రణ పీఠికలో కడపట 'ఇది వనపర్తి రాజాగారి సహాయమున మొదట ముద్రింపబడి ప్రాచీనగ్రంథముల నూరక యిచ్చినను చదువువారు లేని యీ కాలమున నీ భాగమైన పునఃప్రచురమగుటకు సంతసించుచున్నాడ అని మానవల్లి కవిగారు వ్రాసియున్నారు దీనినిబటి వేంకటరావు గారు ఇది పునర్ముద్రితము కాలేదని వ్రయుట అసత్యమని నిర్ధారణ అగుచున్నది.

## భాసనాటకాలు

తెలుగులో భాసనాటకాలను అనువదించిన వాళ లో మానవల్లి కవిగారేమొట్టమొదటివారు అనడంయధార్థం. శ్రీ టి గణపతిశాస్త్రి గారు వాటిని ప్రకటించడానికి పూర్వమే మానవల్లి కవిగారు తాళపత్ర దశలోనే వాటినిచూచి అనువదించినట్లుగా 'కర్ణభారానికి' వారు వ్రాసిన పీఠికవల్ల తెలుస్తున్నది ' ఇంచుమించు మూడు సంవత్సరము లకుఁ బూర్వము స్వప్నవాసవదత్త, ప్రతిజ్ఞాయౌగంధరాయణముల మాత్రము తాళపత్ర పతులు సంపాదించి వాని రచనంపదకు మెచ్చి తెనిగించి యుంటిని. ఇటీవల గార్యాంతరముగా గేరళ దేశమున కేతెంచి తక్కుంగల పదునొకండు రూపకములఁ జదివి యభూత పూర్వమగు నానందమునుజెంది వాని నెల్ల నల్పకాలములోఁదెనిం గించితిని' (కర్ణభారపీఠిక). 1913 లో శ్రీ కవిగారు కర్ణభారం పీఠికలో వ్రాసినవాక్యాలివి. దీన్నిబట్టి 1910 ప్రాంతంలో వారు స్వప్నవాసవదత్త, ప్రతిజ్ఞా యౌగంధరాయణాలను తెలిగించారనీ, ఆతర్వాత కర్ణభార పకటనకాలానికి ముందుగానే తక్కిన పదకొండు రూపకాలనూ తెనిగించారనీ ఈవ్రాతవల్ల అర్థమవుతుంది. అవిమారకాన్ని 1916 లో ప్రకటించారు కానీ కవిగారు ఆ నాటకం చివర దాన్ని తాము తెనిగించిన కాలాన్ని తెలుపుతూ వ్రాసిన పద్యాన్ని బట్టి అదికూడా 1913 లోనే రచితమయినట్టు తెలుస్తున్నది. కనుక ని. వెం. గారు భావించినట్లుగా మానవల్లి కవిగారు అవిమారకాన్నికూడా 1913 లోనే తెనిగించి పకటించడం మాత్రం 1916 లో చేసినట్లు నిశ్చయించవచ్చు ఈరెండు నాటకాలూ మనకు లభిస్తున్నవి కవిగారు 1916 లో ప్రకటించిన అవిమారకం చివరి అట్ట మీద మరికొన్ని భాసనాటకాలనుకూడా ప్రకటించినట్లుగా వాటి వెలలతోబాటు వివరాలుయిచ్చి వున్నారు. వాటినిబట్టి కర్ణ భారము, అవిమారకము కాక వారు మరియేదు భాసనాటకాలను అనువదించి ప్రకటించినట్లుగ తెలుస్తున్నది తక్కిన భాసనాట

కాలనుగూడా తెనిగించినామని వారు కర్ణభారంపీఠికలో తెలిపిఉన్నా అవి ముద్రితంకాక లిఖితరూపంలోనే ఉండవచ్చని ని. వెం. గారు అభిప్రాయపడుతున్నారు. వారు ముద్రించి ప్రకటించినట్లుగా వెలలు తెల్పిన ఏడునాటకాలూ ఎక్కడాలభించడంలేదని ని. వెం.గారే 'వాస్తున్నారు నా అభిప్రాయంలో ... నవల్లి కవిగారు భాసనాటకాలను అన్నిటినీ అనువదించిఉన్నా వారు ముద్రించినవి మాత్రం కర్ణభారం, అవిమారకం మాత్రమే. అవిమారకం చివరిఅట్టమీద వారు వెలలు ప్రకటించి ఉడడం కేవలం వ్యాపారదృష్టితోనే. తక్కిన నాటకాలతో పాటు ఈ యేడు నాటకాలుకూడా అప్రకటితాలుగా లిఖితరూపంలోనే వారిదగ్గరఉండి ఉండవచ్చు. లేదా వారు ఈ రెండు నాటకాలను మాత్రమే తెనిగించి ప్రకటించి తక్కినవాటిని కూడా కాలక్రమాన తెనిగించి ప్రకటించవచ్చనే సదుద్దేశంతోనే ముందస్తుగా వాటి నన్నిటినీ తెనిగించినట్లుగానే 'కర్ణభారం' పీఠికలో ప్రకటించుకొని ఉండవచ్చు. ఇది సాధారణంగా రచయితలు చేసేపనే. ఇలా అన్నంత మాత్రం చేత కవిగారి కీర్తికి అపకర్ష యేమాత్రం కలగదు. అలాకాక వారు ఆ యేడు నాటకాలనూ ప్రకటించి ఉండి, వాటిలో ఏ ఒక్కటైనా ఏదైనా గ్రంథాలయంలోగానీ, ఎవరి దగ్గరనైనా గానీ లభిస్తే ఈ అభిప్రాయం మార్చుకోవడానికి నేను సిద్ధంగా ఉన్నాను. అలాగే వారు అనువదించామని చెప్పకొన్న యితర నాటకాల అనువాదాల తాలూకు లిఖిత ప్రతులు వారి పుత్రుల దగ్గరో, బంధువుల దగ్గరో ఉండి వాటిని సంపాదించగలిగితే ఆ అభిప్రాయం కూడా ఏర్పకోవడానికి నేను సిద్ధం. ఏతావతా మానవల్లి కవిగారు భాసనాటకాల్లో ఒక్క 'కర్ణభారం', 'అవిమారకం' అన్న రెండు రూపకాలనే అనువదించి ప్రకటించారనీ, తక్కినవాటిని కూడా అనువదించి ఉండడమూ, వాటిలో యేడింటిని ప్రకటించి ఉండడమూ సందేహాస్పదమనీ, వాటిని అన్నిటినీ కూడా అనువదించి ప్రకటించాలనే సంకల్పం మాత్రం వారికి ఉండి ఉండవచ్చునీ నా దృఢమైన అభిప్రాయం.

### కవి బిరుదం

'మానవల్లి కవిగారికి కవిబిరుదం ఎప్పుడు ఛివరిచ్చారో తెలుసుకొనడం దుస్సాధ్యంగానే ఉన్నది' అని అంటూ ని. వెం. గారు దాన్ని గురించి కొంత చర్చచేశారు. పనప్పాకం ఆనందాచార్యులుగారి యింట జరుగుచుండిన విద్యాగోష్ఠులలో ఒకనాడు కవిగారికి ఆ బిరుదును ఆనందాచార్యులుగారు ప్రసాదించినట్లుగా ప్రభాకరశాస్త్రిగారు తమకు తెల్పిన ఆ సన్నివేశ వివరాలను ని. వెం. గారు వివరంగా తెలిపారు. వారు తెలిపిన ఆ విషయం ప్రభాకరశాస్త్రిగారి ముఖతః నేను కూడా విన్నాను. కానయితే ని. వెం. గారు ఆ సంభవం జరిగిన కాలం కూడా యిచ్చి వుంటే ఎంతో ఉపకరించేది. అది జరిగింది ప్రభాకరశాస్త్రిగారు ఉద్యోగ ప్రయత్నంలో చెన్నపురి చేరిన కొత్తలో. వారు చెన్నపురి చేరింది 1908 సంవత్సరంలో (చూ. ప్రజ్ఞాప్రభాకరం పుట 36) కనక కవిగారి కీ బిరుదం ఆనందాచార్యులవారు ప్రసాదించింది. 1908 వ సంవత్సర ప్రాంతంలో అయి వుండవచ్చు.

### వసంత విలాసం

'మానవల్లి కవిగారి కావ్య రచనా విశేషాలను గురించి చర్చిస్తూ ని. వెం. గారు పండ్రెండేళ్ళ ప్రౌఢ వయస్సులో వసంత విలాసము' అను నత్యద్భుత కథా సన్నివేశము కలిగి కళాపూర్ణోదయమునకు బూర్ణముగా సాటి వచ్చు వసంత విలాసము అనెడి రసవత్కృతిని రచించినారు. వారు దానిని ప్రౌఢ వయసులో రచించినట్లుగా ని వెం. గారు యే ఆధారంతో నిర్ణయానికి వచ్చారో తెలుపలేదు అముద్రితంగా ఉన్న ఈ కావ్యాన్ని యేలూరుపాటి రామభద్ర చయనులుగారు కృతి నందుటకు అంగీకరించారనీ, కానీ, కవిగారు దాని తాలూకు వ్రాతప్రతిని వారికిచ్చినా, అది వారి కంకితంగా ముద్రితం కాలేదనీ, ఆ వ్రాతప్రతి శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు ఎలాగో కష్టపడి సంపాదించారనీ తెల్పడమే కాక అందలి కృత్యాదిని ఈ సంపుటం చివర ముద్రించారు. వారు తెలిపిన వివరాన్నిబట్టి ఇందులో తొమ్మిది ఆశ్వాసాలు, 2362 పద్యాలు ఉన్నాయి. దీని వ్రాతప్రతిని కష్టపడి సంపాదించిన శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారి కీ, దాని కృత్యాదిని ఈ సంపుటంలో ప్రకటించిన ని. వెం. గారికీ ఆంధ్రలోకం ఋణపడి ఉంటుంది. అయితే యిందులో ఒక చిక్కు ఉంది. ఇందులోని ఆశ్వాసాంత గద్య 'ఇది శ్రీ కలాంక కవి విరచితం బగు వసంత విలాసంబునందు ప్రథమాశ్వాసము' అని ఉన్నదనీ, 'కలాంక కవి' అన్నది కవిగారు పెట్టుకొన్న సాహిత్య నామం (Pen name) అనీ ని వెం గారు తెల్పారు. ని.వెం.గారి యీ అభిప్రాయంతో నేను యేకీభవించడం లేదు. మానవల్లి కవిగారు తమ ఇతర రచనల్లో ఎక్కడా 'శ్రీ కలాంక' అనే సాహిత్య నామాన్ని వాడలేదు. శ్రీ పనప్పాకం ఆనందాచార్యులు గారు ప్రసాదించిన 'కవి' అన్న బిరుద నామాన్నే వారు అభినివేశంతో వాడుకొంటూ ఉండినారు.

### మృ గా వ తి

ఇది శ్రీ రామకృష్ణకవి ప్రణీతంబైన మృగావతి యందు

ప్రబధమాశ్వాసము-1890 ని వెం పీఠిక పుట 518.

**కళింగసేన**

ఈ దినము రామకృష్ణకవి ప్రణీతంబైన 'కళింగ సేన'అను ప్రకరణంబు ప్రయోగించి చూపుదము— ప్రస్తావన. ని.వెం. పీఠిక పుట 67.

'ఇది, శ్రీరామకృష్ణకవి ప్రణీతంబైన కళింగసేన యను ప్రకరణంబు నందు తృతీయాంకము' ని.వెం. పీఠిక పుట 69.

**అవిమారకం**

'విరచించెన్ రామకృష్ణ విబుధుఁడు దీనిన్ — ని.వెం. పీఠిక పుట 62.

**వత్సరాజ చరితము**

'వత్సరాజ చరితము మానవల్లి రామకృష్ణకవి విరచితము ని వెం. పీఠిక పుట 53.

**భరతకోశం**

నామ్నా భరతకోశోఽయం విద్వ్యావ్యసనివాం, ముదే రామకృష్ణేన కవినా సార్ధవర్ష ద్వయావధౌ. ని వెం పీఠిక 72.

**కర్ణభారం**

మా. రామకృష్ణకవి — కర్ణభారం పీఠికలో సంతకం.

అంతకుముందు మానవల్లి రామకృష్ణయ్యగానేఉండిన మానవల్లి కవిగారు కవిబిరుదు ప్రసాదింపబడిన తర్వాత 'మానవల్లి రామకృష్ణకవి' అనే వ్రాసుకొంటూ వచ్చారు. తుదకు ఇంగ్లీషులో చేసినా, తెలుగులో చేసినా 'మానవల్లి రామకృష్ణకవి' అనే సంతకం చేస్తూ ఉండేవారు ఈ విషయం ని వెం.గారే ఫటలో పేర్కొనికూడా ఉన్నారు అలాంటప్పుడు తమకు ప్రీతిపాత్రమైన, తమ రచనల్లో అంతటా వాడుకొంటూ ఉండిన 'కవి' బిరుదు తోడిపేరును మాని, 'అదీ ఒక్క వసంత విలాసంలో మాత్రమే '(శ్రీ కలాంక'అన్న సాహిత్య నామం (**Pen name**) పెట్టుకోవలసిన అవసరం రామకృష్ణ కవి గారికి ఎందుకు కలిగిందో దురూహ్యం. ని వెం. గారు దానికి ఎలాంటి ఉపపత్తులనూ చూపలేదు. కాబట్టి నా అభిప్రాయం యేమంటే మానవల్లి కవిగారు 'శ్రీ కలాంకకవి' విరచితంబైన ప్రాచీన ప్రబంధం లభించిందని చెప్పి దాన్ని తమ 'సారస్వత సర్వస్వం'లో ప్రకటించవలసిందిగా లేదా ప్రత్యేక గ్రంథ రూపంలో ప్రకటించ వలసిందిగా శ్రీ యేలూరుపాటి రామభద్ర చయనులుగారిని అర్థించి ఉండవచ్చు. దానికి వారు తొలుత అంగీకరించినా కారణాంతరాలచేత ప్రకటించి ఉండకపోవచ్చు ఈలోగా వారు గతించడం కూడా అది ప్రకటితం కాకపోవడానికి కారణం కావచ్చు. కానీ ఈ సంపుటంలో చివర ప్రకటించబడిన అందలి కృత్యాది పద్యాన్నిబట్టి, అది కవిగారి రచనే అని ధ్రువపడుతుంది. దానికి కారణం ఆయన రచనలుగా నిర్ధరింపదగిన పద్యాలు అందులో ఉండడమే. వసంత విలాసం కృత్యాదిలో 13 వ పద్యం యిలా ఉంది:

క చిరకాల మెడసి క్రమ్మఱ
నరుదెంచిన యాలుబోలె నస్మత్కవితా
సరణి యనుకూల గామియుఁ
దరతర మొడఁబాటు సేత తధ్యము మాకున్.

(పుట 550)

1913లో ప్రకటించిన 'కర్ణభారం' పీఠికలో కవిగారు ఇలా వ్రాశారు 'ఇరువది సంవత్సరములుగాఁ బద్యరచనఁ బరిత్యజించిన నా కిదియు దుర్ఘటమే అయియుండును. కావున నిందుఁ బదబంధము పరుషమై యుండినఁ బండితులు క్షమింతురుగాక: కీర్తిసేన యను కవయిత్రి —

క చిరకాల మెడసి క్రమ్మఱ
నరుదెంచిన యాలుఁ బోలె నస్మత్కవితా
సరణి యనుకూల గామియుఁ
దరతర మొడఁబాటు సేత తధ్యము మాకున్'

అన్నట్లు లగు నేమో !

దీని,బట్టి 1913లో కర్ణభారం పీఠికలో కీర్తిసేన అనే కవయిత్రి శ్లోకానువాదాన్ని ప్రసక్తానుప్రసక్తంగా పేర్కొన్న శ్రీ మానవల్లి కవిగారు ఇదే పద్యాన్ని 'వసంత విలాసం' రచనలో సందర్భానుసారంగా చొప్పించి ఉండవచ్చు. లేదా — అప్పటికే తాము రచించిన వసంత విలాస రచన' నుండి 'కర్ణభారం లో దీన్ని ఉపయోగించుకొని ఉండవచ్చు. అయితే రెండవపక్షం అంత యుక్తియుక్తంగా తోచదు. ఎందుచేతనంటే— ఇరవై సంవత్సరాలుగా పద్యరచన పరిత్యజించినామని వారే చెప్పుకొని ఉండటంచేత. అందుచేత మొదటి పక్షమే

వ్యాయం ఇది గాక కృత్యాదిలో (వసంతవిలాసం) 20 వ పద్యం ఇలా ఉన్నది

క. గుఱు తెఱిఁగి తెలుఁగుమఱుఁగులు
తెఱఁగొప్పఁగ మార్గ దేశి తెఱఁగుల నోలిన్
గఱచి చవిపుట్టఁ జెప్పక
మఱకువ నోరార్చుమమ్మ మ్రందింపకుఁడీ.
(పుట 557)

ఇందలి రచన కుమారసంభవం ప్రభావాన్ని పట్టి యిస్తుంది 'గుఱు తెఱిఁగి వస్తుచయమును' - (కుమా. 1) మార్గదేశి పదాల ప్రయోగం (కుమా 1). ఇవి రెండూ యిందలి రచనను ప్రభావితం చేసి ఉంటాయి. దీన్నిబట్టి 'వసంతవిలాసం' మానవల్లి కవిగారి రచనేనని, 'శ్రీ కలాంక కవి' పేరుతో దాన్ని వారు ప్రకటింప దలచి ఉంటారనీ నేను భావిస్తున్నాను. ఇలా కాక 'శ్రీ కలాంక కవి' ఆయన సాహిత్యనామ మని నిర్ధరించడానికి తగిన ఉపపత్తులు ని.వెం. గారు కానీ, యితరులు గానీ చూపగల్గితే ఒక మహాకవిపట్ల అజ్ఞానంతో వేసిన అభాండానికీ, మోపిన అపవాదానికీ నేను పశ్చాత్తప్తుణ్ణవుతాను. కవిగారికీ, రామభద్ర చయనులుగారికీ ఈ విషయంతో జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు సేకరింపగలిగితే కొంత నిజం బైట పడవచ్చు. మానవల్లి కవిగారి కావ్య రచనల గురించి వ్రాస్తూ ని.వెం. గారు ఈ విధంగా తెల్పారు: 'కవిగారు కౌమార వయఃప్రారంభమున మృగావతి రచితమైనదని యీవరకే తెల్పితిని. ఆ వెనుక కవిగారు 'పాటలీపుత్రక' కావ్యము, భాసనాటకాంధ్రీకరణములు (కర్ణభారము, అవిమారకము). కళింగసేన అనెడి స్వతంత్ర ప్రకటనము, వత్సరాజ చరిత్ర నవల రచించిరి. (ని వెం పీఠిక 51 పుట) భాస నాటకాలనుగురించి వ్రాస్తూ మానవల్లి కవిగారు కర్ణభారము, అవిమారకమే కాక మరి యేడు నాటకాలను కూడా ప్రకటించినారని తెలిపిన ని వెం.గారే యిక్కడ వారు చేసిన భాసనాటకాంధ్రీకరణాలు 'కర్ణభారం, అవిమారకం' అని మాత్రమే కుండలీకరణాలలో తెల్పినారు పై వాక్యంలో 'పాటలీపుత్రక' కావ్యం మృగావతి తర్వాత రచితమైనట్లుగా తెలుపబడింది. మానవల్లి కవిగారికి కవి బిరుదం వచ్చిన సన్నివేశాన్ని వివరించే ఘట్టంలో శ్రీ పనప్పాకం ఆనందాచార్యులు గారి యింట జరిగిన గోష్ఠిలో శ్రీ కవిగారు పాటలీపుత్రక కావ్యంలోని కొన్ని పద్యాలను ఆశువుగా చదివినట్లు తెలిపారు. ఆ సన్నివేశాన్ని బట్టే ని వెం. గారు మృగావతికి తర్వాత పాటలీపుత్రక కావ్యం రచింపబడిందని ఊహించి యుండవచ్చుననిపిస్తుంది దీనికి సంబంధించి దీన్ని గురించిన వివరాలు ఏమీ ని.వెం గారు తెలపలేదు అ పుస్తకం యేమయిందీ, ప్రకటితమయిందో లేదో, వారి వారసులదగ్గర అది లభిస్తుందో లేదో— లిఖితరూపంలో వుంటే— మొదలయిన విషయాలు మనకు తెలియరావటంలేదు.

### *కవిగజాంకుశం*

పీఠిక 29 పుటలో కవిగారు తొలిసారిగా ప్రకటించిన యీ గ్రంథాన్నిగురించి ని వెం. గారు ప్రస్తావించారు 1950 లో వావిళ్ళవారు దీన్ని పునర్ముద్రించినప్పుడు అది ని వెం. గారు, నేనూ కలసి చేసిన పరిష్కరణతో వెలువడింది కవిగారు మొదటిసారిగా ప్రకటించిన అనేక గ్రంథాలను జరిగిన పునర్ముద్రణల వివరాలు అనవసరమైనా తెలిపిన శ్రీ ని. వెం. గారు దీని పునర్ముద్రణాన్ని గురించి మాత్రం తెలపకపోవడానికి కారణం తెలియదు. అలాగే భాస నాటకాలకు తెలుగులో వెలసిన యితరుల అనువాదాలను గురించిన వివరాలు తెలిపిన సందర్భంలోకూడా నేను భాసుడి స్వప్నవాసవదత్తకి చేసిన ఆంధ్రానువాదవిషయం పేర్కొనడం విస్మరించారు.

### *ఆంధ్రభాషను గూర్చిన యుపన్యాసము*

కవిగారు 1927లో మదరాసు విశ్వవిద్యాలయంవారి ఆదేశం పై తెలుగు సాహిత్యపరిణామమునుగూర్చి వ్యాప్తి ఉపన్యాసము ఒకదానిని యిచ్చిఉన్నారనీ, అది 'ఆంధ్రభాషనుగూర్చిన యుపన్యాసము అనే పేరుతో ముద్రితమయిందనీ ని. వెం.గారు తమ పీఠిక 32 పుటలో పేర్కొంటూ కుండలీకరణాలలో' 1895 లో పురశవాకమున ఇచ్చిన ఉపన్యాసమును ఇదియే' అని వ్రాశారు. కుండలీకరణములలో తెలుపబడిన యీ వాక్యాన్నిబట్టి శ్రీ కవిగారు 1895లో పురశవాకంలో యిచ్చిన ఉపన్యాసాన్నే మళ్ళీ యేలాంటి మార్పులూ, చేర్పులూ చేయక 1927 లో మదరాసు విశ్వవిద్యాలయంలో వ్యాప్తి ఉపన్యాసంగా (Extention Lecture) యిచ్చినారనీ అర్థమవుతుంది. ఇంచుమించుగా ముప్పై సంవత్సరాలనాడు తాము ఒక సభలో చదివిన ఉపన్యాసాన్నే తిరిగి విశ్వవిద్యాలయంలో ఎలాంటి మార్పు చేర్పులూ లేక యథాతథంగా వ్యాప్తి ఉపన్యాసంగా కవిగారు చదివారనడం నిజమయితే అది ఆయనకు ప్రతిష్ఠా దాయకంకాదు. ఈ రెండు ఉపన్యాసాలకూ కొంతైనా తేడా ఉంటుందని నావిశ్వాసం. విశ్వవిద్యాలయంలో దానితాలూకు ప్రతిని సంపాదించి యీవిషయం తేల్చుకోవలసిఉంటుంది.

ని వెం గారు తమ పీఠికలో అక్కడక్కడా చూపిన ఆకరాలకు సంబంధించిన అన్ని వివరాలని యివ్వడం జరగలేదు—చాలా సందర్భాలలో. దీనివల ఆయా ఆకరాలను చూడదలచుకొన్నవారికి వారి అధోజ్ఞాపికలలోని వివరాలు యేమాత్రం ఉపకరించేవిగా లేవు. అలాంటివి కొన్ని ంగ్రాకింద పొందుపరుస్తున్నాను.

పుట 22 'ఈ యనర్ఘ రాఘవము ఈ తరువాత తిరిగి ముద్రితమైనదే యయినను' ——ఎవరిచేతనో తెలుపలేదు.

అదేపుట. 'హరిభట్టు విరచితమగు మత్స్య పురాణమును తొలుత సంపాదించి ప్రకటింపజేసిన యశస్సు ..' ఎక్కడ ప్రకటింప జేసినారో తెలుపలేదు.

అదేపుట. '1904లో వీరేశలింగంగారు ముద్రించిన వెనుకనే వావిళ్ల వారు రెండు ముద్రణములు ఈ గ్రంథమునకు వెలయించిరి' — వావిళ్లవారి రెండు ముద్రణములూ ఎప్పుడు జరిగినవో తెలుప లేదు.

పుట 24. 'నేడా గ్రంథము తిరిగి విపుల పీఠికా పరిష్కరణములతో ప్రకటితములైనవి' — ఎవరిచే ప్రకటితము లయినవో వివరాలు తెలుపలేదు,

పుట 28. 'భారతిలో పుష్పాంజలి శీర్షికలో ఇదివరకు కవిచరిత్రకెక్కని ప్రబంధములను గూర్చి తెలిపిరి——' ఏ సంవత్సరం ఏ నెల భారతిలో?

అదేపుట. 'అది వావిళ్ల వారిచేత ప్రకటితము' — ఎప్పుడు?

పుట 66. 'ఇది 1944లో ఆంధ్ర విశ్వవిద్యాలయములో ప్రథమ శాస్త్ర పరీక్ష (ఇంటర్మీడియేటు) కు పఠనీయగ్రంథము— ఏది ? అంతకు ముందు నలుగురు రచయితల పేర్లు మాత్రమే యిచ్చి యున్నది.

అదేపుట. వారు తెనిగించినవి మేధ్యమవ్యాయోగము, కర్ణభారము ప్రతిమా నాటకము....' ప్రకటించిన తేదీలు ఇవ్వలేదు

మానవల్లి కవిగారి వైయక్తిక జీవితాన్ని గురించీ, సాహిత్య జీవితాన్ని గురించీ, సాహిత్య సేవను గురించీ తను పీఠికలో అనేక విషయాలను తెలిపిన ని. వెం గారు వారి ఆ ఉభయ జీవితాలకీ సంబంధించిన ప్రధాన ఘట్టాలను కాలక్రమానుసారంగా కూర్చి వారి పీఠికలో పొందుపరిచి ఉంటే అది సాహిత్య విద్యార్థులకీ, పరిశోధకులకీ ఎంతో ఉపకారకంగా ఉండేది

నిన్న మొన్న మన మధ్య జీవించిన పండితోత్తముని జీవితానికి సంబంధించిన వివరాలే మనకు పూర్తిగా అందక పోవడం చాలా శోచనీయం ని వెంగారు వారు పుట్టిన సంవత్సరం తెలిపారే కానీ, పుట్టిన తేదీ తెలప లేక పోయారు. అలాగే వారు మదరాసు విశ్వవిద్యాలయంలో బి.ఏ. పట్టం పుచ్చుకొన్న సంవత్సరం. ఎం.ఏ పట్టం పుచ్చుకొన్న సంవత్సరం తాలూకు వివరాలు తెలపలేదు వారి శాఖ వారి కుటుంబానికి సంబంధించిన కొన్ని వివరాలు కూడా వారు తెలుసుకోడానికి ప్రయత్నించలేదు ప్రయత్నించినా కృతార్థులు కాలేదేమో, వారు ములకనాడు శాఖకు చెందిన వైదిక బ్రాహ్మణులు. నాకు తెలిసి వారికి నలుగురు కుమారులు. మొదటి కుమారుడు అల్పాయుష్కుడుగానే దివంగతు డయినాడు తరువాతి యిరువురు కుమారులను గురించీ ని వెం. గారు తెలపనే తెలిపారు నాల్గవ కుమారుడు శాంతమూర్తి మాత్రం తిరుపతిలో ఆయన ఉద్యోగం చేసేటప్పుడు ఆయనతో ఉండినాడు. అతను కూడా చదువులో అంతగా ఎక్కిరాలేదు. అతనికి కవిగారు యుక్త వయస్సులో వివాహం చేశారు, ఆయనకు పుత్ర శోకవ్యధను మాత్రం మిగిల్చి అతడూ అల్పాయుష్కుడుగానే మరణించినాడు. చిన్నతనంలోనే వైధవ్యం పొందిన ఆ అమ్మాయి తల్లిదండ్రులతో తిరుపతిలో మా యింటి పక్కనే నివసిస్తూ ఉండినది. దరిమిలా ప్రాచ్య కళాశాలలో విద్వాన్ తరగతులలో చదువుతుండినది. తమవద్ద ఉండిన పుస్తకాలను దేవస్థానంవారి లైబ్రరీకి (ప్రాచ్య పరిశోధనాలయ గ్రంథభాండాగారం) ఆయన అమ్మినప్పుడు వచ్చిన డబ్బును ని. వెం. గారు తెలిపినట్లుగా వారి కుమారులు తగవులాడి తీసుకొని పోలేదు. వారికి తానేమీ మిగల్చలేక పోయాననే అన్న వ్యథలో ఆయనే వారికి దానిలో పాలు పంచి యిచ్చారు. కడగొట్టుకోడలి దయనీయ స్థితిమీద జాలిపడి ఆయనే స్వయంగా వచ్చి తనకు వచ్చిన పైకంలో కొంతభాగం ఆమెకు యిచ్చి వెళ్లారు అలాంటి పితృ హృదయం వారిది. పత్నీ వియోగం పొందినవారు తిరిగి వివాహం చేసుకోలేదు. తమ నిరంతర సాహిత్య వ్యవసాయంతో పాటు సాపాటుకై వారు చేతులు కాల్చుకోవలసిన పరిస్థితి కూడా యేర్పడింది. దాన్ని కూడా వారు చాలా ఓరిమితో—ఎలాంటి విసుగూ వేసటూ కనబరచకుండా చేసుకుంటూ పోయేవారు అయినా వారు ఎక్కువగా భోజనహోటళ్ల మీదే ఆధారపడవలసి వచ్చేది అది కూడా ఒకందుకు మంచిదే అయింది. ఆయన ప్రతినెలా చెల్లించిన బిల్లులతో

ధనవంతు లయిన హోటలుయజమానులు ఆయన జీవిత 'చరమ దశలో సంపాదన లేక తిండికి అవస్థపడుతుండినప్పుడు వారు ఆయన పరిస్థితిని గుర్తించి ఉచితంగానే భోజనం పెట్టి కాఫీలు యిచ్చి ఆయన్ని పోషించారు. ధర్మబుద్ధి కలిగిన ఆ హోటలు యజమాని యిప్పుడు సజీవులుగానే ఉన్నారు ఆయన అప్పాదురై అయ్యరు ఏ సాహిత్యం కోసం ఆయితే, ఏ జాతికోసం అయితే ఆయన జీవితకాలం అంతా తపించి. పరిశ్రమించాడో ఆ సాహిత్యమూ, ఆజాతీ చివరికాలంలో ఆయనకు బువ్వపెట్టలేదు. పావలాకు. అర్ధ రూపాయకూ ఆయన ఇతరుల పంచలో చెయ్యి చాచవలసి రావడం ఆయన చేసుకున్న పాపం, అది ఆయన ఆంధ్రుడుగా పుట్టడం.

ఈ సంపుటంలో వారు తెలుగులో వ్రాసిన రచనలు మాత్రమే సంకలింపబడినాయి అలాగే వారు సంస్కృతంలోనూ, ఆంగ్లంలోనూ వ్రాసిన వ్యాసాల తాలూకు సకంలనం కూడా ఒకటి వెలువడితే ఆయన భారతీయ భాషా సరస్వతికి చేసిన అమూల్యమయిన సేవ భాషాంత రీయులయిన సాహిత్య పరులకు కూడా అందే అవకాశం ఉంటుంది. ఈ సత్కార్యాన్ని చేసిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారే ఆ మహత్కార్యాన్ని కూడా చేపట్టుతారని ఆశిస్తున్నాను. అలాగే ని వెం. గారు తమ పీఠికలో సూచించినట్లుగా శ్రీ ప్రభాకర శాస్త్రిగారి తెలుగురగిలు అన్నిటినీ సంధానించిన ఒక సంకలన గ్రంథం ఒకటి ప్రకటించే కార్యం కూడా అకాడమీ చేపట్టుతుందని ఆశిస్తున్నాను. తెలుగులో పద సాహిత్యం విస్తారంగా ఉంది అందులో చాలాభాగం ని వెం. గారు తెలిపినట్లుగా అముద్రితంగానే ఉండిపోయింది వారు సూచించినటు 'తెలుగు పద సాహిత్య సర్వస్వం' ఒకటి కూడా అకాడమీ చేపట్టాలి.

తిరుపతిలో శ్రీ మానవల్లి కవిగారు చాలా కాలం ప్రాచ్యవిద్యా పరిశోధనాలయంలో ఉద్యోగం చేసి, భరతకోశ ప్రకటనద్వారా ఆ సంస్థకూ, తాము నివసించిన పట్టణానికీ కీర్తి ప్రతిష్ఠలు తీసుక వచ్చారు చివరకి అక్కడే తనువు చాలించారు కూడా. అందుచే శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని ప్రాచ్య విద్యా పరిశోధనాలయ ఆవరణలో వారి శిలా ప్రతిమను ఒకదానిని నెలకొల్పడానికి విశ్వవిద్యాలయ పాలకవర్గం ఆలోచించాలి. దానికి వలసిన నిధులను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు వారికి అందజేసి తోడ్పడాలని కోరుతున్నాను మానవల్లి కవిగారి మహిత సారస్వత జీవితం పరిశోధింపదగిన ఒక విషయం దాన్ని గురించి ఆంధ్రప్రదేశ్‌లోని యే విశ్వవిద్యాలయంలోనైనా పరిశోధన జరిగి తత్ఫలంగా గ్రంథం ప్రకటింపబడిననాడు సాహిత్యపరులు ఆ సాహిత్య తపస్వి ఋణంకొంతైనా తీర్చుతున్నట్లు అవుతుందని నా అభిప్రాయం.

---



# ఇరుకు ప్రపంచం

## శ్రీ కలువకొలను సదానంద

గిరగిర గిరగిర గిరగిర గిరగిర . . .

నేలా నీళ్ళూ—గాలీ ధూళీ—మబ్బూ వానా-కొండా కోనా—వాగూ వంకా—చెట్టూ చేమా— చెరువూ దొరువూ—గొడ్డూ గోదా—గడ్డీ గాదం—గిరగిర గిరగిర గిరగిర గిరగిర... ఊరూ నాడూ-పల్లే పట్నం—మిట్టా పల్లం—మేడా గోడా—గిరగిర గిరగిర గిరగిర గిరగిర ..

ముసలీ ముతకా—పిల్లా పీచూ—గోచీ గిన్నే—కొంపా గంపా—గిరగిర గిరగిర గిరగిర గిరగిర ...

అందమైన ప్రపంచం

రంగురంగుల ప్రపంచం

వెండిపళ్ళెంలో ఆపిల్ పండులాంటి ప్రపంచం

మట్టి మూకుడులో సంగటి ముద్దలాంటి ప్రపంచం

ఆకలికి చెమర్చిన పేదకుర్రాడి కనుగుడ్డులాంటి నున్నటి ప్రపంచం

పంతులుగారి బల్లమీద ఇరుసు కమ్మీలో — కుక్క నోట్లో కడిలా చిక్కుకున్న నున్నటి ప్రపంచం

...బొంగరంలా తిరుగుతోంది
గిరగిర గిరగిర గిరిగిర గిరగిర
గిరగిర...గిర...గిర...గి...ర...గి...ర...

భూభ్రమణం ఆగిపోయింది

ఆ గ్లోబువైపే కళ్ళప్పగించి చూస్తూ కూర్చున్న కుర్రాడొకడు — భూదేవిని హిరణ్యాక్షు డెత్తుకుపోతున్నట్లుగా తల్లడిల్లిపోతూ 'ప్రపంచం నిలిచిపోయింది!' అంటూ లేచి నిలబడ్డాడు.

వాడి జాత్తుపేరు కాకిగూడు. వాడి చొక్కాపేరు ప్రపంచ పటం. వాడి నిక్కరుపేరు పోస్టాఫీసు. వాడిపేరు బాలయోగి.

పంతులు వాడివైపు చూచి, అన్నాడు. 'ఇది గ్లోబురా! తిప్పితే తిరుగుతుంది. తిరిగినంతసేపు తిరిగి ఆగిపోతుంది ప్రపంచం ఆగిపోతుంది. ప్రపంచం ఆగిపోలేదు. అది యిప్పుడు కూడా తిరుగుతూనే ఉంది. కూర్చో. పాఠం రాయండిక.'

బాలయోగి కూర్చున్నాడు. వాడికి పాఠం పూర్తిగా అర్థమయినట్లూ వుంది పిసరంతయినా అర్థం కానట్లూ వుంది. బల్లమీద వున్నది ప్రపంచం కాదని అనుకోవడానికి వాడి మనస్సు అంగీకరించలేదు.

దానిమీద మనిషి ఎంత వుంటాడు ? చీమంత వుంటాడా ?

అండమాన్ నికోబార్ దీవులే చీమలంత వున్నాయి.

మనిషి ఎంత వుంటాడు ?

దుమ్ములా వుంటాడా ?

వెయ్యి మంది మనుషులు చేరితే, దానిమీద దుమ్ములావుంటారేమో!

భారతదేశం గోరంత వుంది. అందులో యాభై ఆరు కోట్ల మంది బతుకుతున్నారట! ఎంత విచిత్రం !... వాళ్ళు సముద్రంలో పడిపోరూ ?

ఈ గోళం చుట్టూ దాదాపు నాలుగువందల కోట్లమంది వున్నారట! నిజమేనా ? ఈ మాట నమ్మదగిందేనా ? నలభై మంది పిల్లలకే ఈ గదిలో చోటుచాలక ఒకరిమీద ఒకరు కూరుంటున్నారే—అన్ని కోట్ల మందికి ఇంత చిన్న గోళం ఎలా సరిపోతుంది ?

ప్రపంచంలో వున్నవాళ్ళందర్నీ బల్లమీదున్న గ్లోబుమీదికి తరిమితే ఎలా వుంటుంది ? దానిమీద ఒక్కడు మాత్రం నిలబడవచ్చు. వాడి భుజాలమీద మరొకడు, వాడిమీద ఇంకొకడు, వాడిమీద...అలా...అతా...అలా ..లలా...

బాలయోగి తల పైకెత్తాడు. పైకప్పు కనిపించింది. వాడి చూపులు పైకప్పును చీల్చుకుని, ఆకాశాన్ని దూసుకుని, ఊహించలేనంత ఎత్తుకు వెళ్ళాయి 'శ్రీరి నాయనోయ్! చివరి వాడు స్వర్గలోకంలో వుంటాడేమో!' అనుకున్నాడు వాడు.

మళ్లీ వాడి చూపులు భూలోకానికి దిగివచ్చి గ్లోబుమీద నిలిచాయి.

ఎంత యిరుకు ప్రపంచమబ్బా యిది!

ప్రపంచ భారాన్ని మోస్తున్న శేషాహిలా కుర్చీలో భారంగా కూర్చున్న పంతులుగారు పైకి లేచారు. ఏదో పనిమీద హెడ్మాష్టరుగారి గదిలోకి వెళ్లారు.

పంతులు అనే బక్కపులి వెళ్లిపోయింది.

పెద్దపులి బోనులో పడగానే అరాచకం పాలయ్యే అడివిలాతయారయింది తరగతి గది.

పీటలమీద పెళ్ళిలా పాఠాలు ఆగిపోయాయి.

పాటలోని వాద్యాల్లా కంఠాలన్నీ ఊగిపోయాయి.

నలభై కంఠాలు!

నాలుగు వందల కంఠాలు.

నాలుగువందల కోట్ల కంఠాలు.

సంత!

జాతర!

పందుల గూడంత గదిలో ప్రపంచపు సంత!

ఆ మూల గొరడీ! ఈ మూల ప్యారడీ!

అదిగో అక్కడ సర్కస్! ఇదిగో ఇక్కడ మిమిక్రీ!

మియ్యాఁగ్! లవ్‌లవ్! ఈఁ...య్యఁ!

కథలూ కబుర్లూ

సినిమాలూ పాటలూ,

వాణిశ్రీ నాగేశ్వరరావ్—అరెరెరెరెరెరెరె ఎట్టాగో వున్నాది

కృష్ణ సత్యనారాయణా—డిష్కుం డిష్కుం డిష్కుం

లే లే–లే నా రాజా

డుబుక్కు డుబుక్కు డుబుడుబుక్కు డుబుడుబుక్కుడుబుక్

బుడుబుడుక్కు బుడుక్ బుడుక్కు బుడుబుడుక్!

అ ఇ ఉణ్ బు ఇక్! అ ఇ ఉణ్ బు ఇక్!

బాబోయ్, ప్రపంచం నోరు విప్పింది!

చెవులు వినలేనంత ప్రళయం!

తుఫాన్!

సైమాన్!

సైక్లోన్!

నయాగరా దూకుతోంది

ఫ్యూజియామా పొగలు చిమ్ముతోంది!

ఏడు సముద్రాలూ పొంగెత్తి తిరిగి పడుతున్నాయి!

ఆరు ఖండాలూ ఒకదాన్నొకటి మోదుకుంటున్నాయి!

మేజామీది గ్లోబును ఎవడో గిర్రున తిప్పేడు.

బాలయోగి కళ్ళూ చెవులూ గట్టిగా మూసుకున్నాడు.

ఒరే, పైనబడుతున్నావేంరా పంది! జరిగి కూర్చో!

జరిగేందుకు చోటెక్కడుందిరా దున్నపోతూ?

చోటు లేకపోతే చావురా కుక్కా!

ఏమన్నావ్? చెంప పళ్ళు...

'ఛెళ్!'

ఏడుపు!

బాలయోగి కళ్ళు తెరిచాడు. చలికాలమైనా ఉక్కపోస్తోంది. పిల్లలంతా చొక్కాలు విప్పి విసురుకుంటున్నారు. బాలయోగి చొక్కా చెమటతో తడిసిపోయింది. వాడు చొక్కాతీసి రెండు చేతులతో రెండు కొసలూ పట్టుకుని వీపుమీద చెమట తుడుచుకున్నాడు.

ఓ కుర్రాడు దొడ్డికి పోవడానికి తొందరపడిపోతున్నాడు. లేచి నిలబడి, నిక్కరు రెండు చేతులలో ఒడిసి పట్టుకున్నాడు. వాడు వెంటనే గది బయటకు వెళ్ళిపోవాలి. దారి ఎక్కడుంది? దారిచేసుకు పోవాలంటే చాలాసేపు పడుతుంది. వాడు పిచ్చెత్తిన మదపుటేనుగులా అందర్నీ తొక్కుకుంటూ బయటకు పరుగుతీశాడు. వాడి పరుగులో బాలయోగి తొడ నలిగిపోయింది. తొడ పట్టుకుని బాధతో

మెలితిరిగిపోయాడు బాలయోగి.

అబ్బా!

కాలుమోపటానికి చోటు చాలని ప్రపంచం!

ఊపిరి పీల్చుకోటానికి గాలి చాలని ప్రపంచం!

అబ్బా! అయ్యో! ఈ ప్రపంచంలో బ్రతకటం ఎలా? చోటు చాలదు! గాలి చాలదు! ఉక్క! ఇరుకు! ఆఖరికి ఈ ప్రపంచం ఏమౌతుంది? ఏమౌతుంది?

ఓ కుర్రాడు రబ్బరు బుడగతో అందర్నీ వినోదింప జేస్తున్నాడు. దానినిండా గాలిఊది పైకి వొదుల్తున్నాడు. అది ఎగురుతూ తేలుతూ కిందికి వచ్చి పడుతూంది.

బాలయోగి చూస్తున్నాడు.

ఆ కుర్రాడు బెలూన్ నోటిదగ్గర పెట్టుకుని గాలి ఊదుతున్నాడు. రబ్బరు బుడగ క్రమంగా పెద్దదవుతూ వుంది.

'ఇంకా వూదు!' పక్కన కుర్రాడు.

బుడగ దోసకాయంతైంది.

'ఇంకా!'

పనసకాయ.

'ఇంకా!'

గుమ్మడికాయ.

బుడగ యిప్పుడు ప్రపంచంలా వుంది. మేజామీది గ్లోబు కంటే పెద్దదిగా వుంది.

'ఇంకా!'

బాలయోగి కళ్ళూ, ముఖమూ కుంచించుకుపోయాయి. ఆఖరికి ప్రపంచం ఏమౌతుంది? ఏమౌతుంది?

'ఠాప్'

శూన్యం!

* * *

కాకులుదూరని కారడివి, చీమలు దూరని చిట్టడివిలాంటి ఇరుకు సందులో వుంది బాలయోగి యిల్లు. బుస్సెడు ఖాళీ అగ్గిపెట్టెల్ని నేలమీద కుమ్మరించినట్లుగా అడ్డదిడ్డంగా, కిందుమీదుగా వుంటాయి ఆ వీధిలోని యిళ్ళన్నీ! మనిషి ఆ వీధిలో వెళ్ళటం చూచినప్పుడు—రహస్యవీరుడు సొరంగంలో దూరిపోతున్నట్లు, పాము పుట్టలోకి పాకుతున్నట్లు, గండుతుమ్మెద దూరాన్ని తొలుసు న్నట్లూ వుంటుంది. ఆ సందులో మరుగుజ్జవాళ్ళకోసం ప్రత్యేకంగా కట్టించినట్లుగా వుంటుంది, బాలయోగి వాళ్ళయిలు.

చుంచుపిల్లలా యింట్లోకి చొరబడిన బాలయోగి పుస్తకాల్ని ఓమూలపడేశాడు. అప్పుడే తలదువ్వి జడవేసుకున్న ఉషా పెయు పౌడరు డబ్బీని బోరించి దబదబా బాది, కోపంతో దాన్ని వీధిలోకి విసరి కొట్టి, మెండి అదం చేతబట్టుకుని నుదుట బొట్టు పెట్టుకుంటోంది ఎవరో తినిపారేసిన మొక్కజొన్న కండెను నములుతూన్న ముసలిగొడ్డును చూస్తూ దిసమొలతో గుమ్మంలో నిలబడ్డాడు, మూడేళ్ళ తమ్ముడు రాజా

బాలయోగికి చచ్చేంత ఆకలిగా వుంది 'అమ్మా, తింటానికేమైనా పెట్టవే.' అనే మాట నోటిదాకా వచ్చింది అంతలో డేళ్ళచెలి రోజారమణి అడిగింది. 'అమ్మా! ఆకలిగా వుందే! అన్నం పెట్టూ!'

'కడుపా, అది చెరువా! తింటానికి వేళాపాళాలేదూ! దరిద్రపు ముండా! పో అవతలికి!' అంటూ తలి దానినెత్తిన ఓ మొట్టికాయ వేసింది. అది తల తడుముకుంటూ వీధిలోకి పరుగుతీసింది

బాలయోగి గూటిలో కెలికి బొంగిరం చేతికి తీసుకున్నాడు వెళ్ళి బొంగరం ఆడుకుంటే బాగుండును బొంగరం తాడులేదు ఎక్కడో పోయింది. బహుశా అమ్మలంగాకో, నాన్న అండర్ వేర్కో వుంటుంది. కొత్తతాడు కొనుక్కోవాలంటే పదిపైసలు కావాలి పది పైసలు కావాలంటే, దేవుడు ప్రత్యక్షం కావాలి.

వాడు ఆ బొంగరాన్ని మళ్ళీ గూట్లోనే పెట్టేశాడు.

ఆకలి!

అడగందే అమ్మయినా పెట్టదు.

అమ్మను అడగాలేకానీ, ఆకలి తీరేదాకా పెడతుందా? చీవాట్లు!

వాడు తిన్నగా వంటింట్లోకి నడిచాడు 'ఏంరా!' అంటూ రోజారమణిని చూచిన కళ్ళతోనే వాణ్నికూడా చురచుర చూసింది తల్లి.

'ఏంలేదు' అనాడు వాడు కడవలో నీళ్ళు ముంచి ముంచీ వరుసగా నాలుగు లోటాలు తాగేశాడు [illegible] పాత మొలతాడు పుటుక్కున తెగింది. చొక్కాపైకెత్తి [illegible]

కున్నాడు నిక్కరులోంచి తాడు కిందికి వేలాడుతోంది దాన్ని చేతికి లాక్కున్నాడు వాడికి సంతోషం వేసింది.

వెళ్ళి తాడు లేకుండా గూట్లో పడివున్న బొంగరాన్ని మళ్ళీ చేతికి తీసుకున్నాడు. తెగిపోయిన మొలతాడును దానికి చుట్టాడు. తాడు చాలలేదు. ఆ చాలీచాలని తాడుతోనే బొంగరం వేశాడు.

బొంగరం తిరిగింది గిరగిరమంటూ, తల్లకిందులుగా!

మేజామీది గ్లోబులా గిరగిరా తిరిగింది.

బాలయోగి తాడుచుట్టి మళ్ళీ వేశాడు.

బొంగరం తిరిగింది—పేదవాడి బతుకులా, చిత్రమైన ప్రపంచంలా—తల్లకిందులుగా!

'ఛీ! ఈ తాడుపనికిరాదు!' అంటూ ఆతాడును సైడు కాలవలోకి గిరవాటువేశాడు. బొంగరాన్ని గూట్లోకి విసిరేశాడు. గుమ్మంలోకివచ్చి, బయటకు వెడదామా, లోపలికి వెడదామా అని ఆలోచిస్తూ కొంతసేపు నిలబడ్డాడు.

ఇంట్లో వుండాలంటే వాడికి తలనొప్పి, అసహ్యం. ఆ యింట్లో వుంటున్నవాళ్లు మనుషులుకాదు. పిరికిభూతాలు. వాళ్ళ ముఖాల్లో వెలుగేవుండదు. పీనుగుల్లా చూస్తుంటారు పీనుగుల్లా తిరుగుతుంటారు. ఒకరితో ఒకరు మాటామంచీలేకుండా ఎవరికి వారు స్వంత ఆలోచనల్లో మునిగిపోయి మరమనుషుల్లా బతుకుతుంటారు.

చెల్లీ, తమ్ముడూ బావురుమంటూ మార్చిమార్చి రాగాలు తీస్తుంటారు. ఆశ్రీయ అదేపనిగా వినుక్కుంటూ వుంటుంది. దేశరక్షణ నిధికోసం వసూళ్ళకువచ్చి వేదికమీద నిలబడి చైనావాణ్ణి, పాకిస్తాన్‌వాణ్ణి గుక్కతిప్పుకోకుండా తిట్టిపోసే మంత్రి మహాశయుడిలా—అమ్మ తిట్లదండకం వల్లిస్తూనే వుంటుంది.

ఇంట్లో ఎవరో ఒకరు చచ్చిపోయి, మిగిలినవాళ్ళంతా దిగాలుపడి కూర్చున్నట్లు—భయంకరంగా వుంటుంది ఆయింట్లో వాతావరణం. రోజూ సాయంకాలాల్లో బడివదలినతర్వాత చీకటిపడేదాక బాలయోగి వీధులవెంట తిరగటానికి కారణం ఇదే!

జలదారి తూముల్లో తిరుగాడే పందికొక్కులా—సందుగొందుల వెంటపడాడు బాలయోగి

ఒకచోట కొందరు పిల్లలు గోళీలు ఆడుకుంటున్నారు. ఖగోళాలకుమల్లే చరచరా దొర్లుకుపోతున్నాయి గోళీలు. గతితప్పిన గ్రహాలకుమల్లే టకీటకీమంటూ ఒకదానికొకటి మోదుకుంటున్నాయి.

మరోచోట బొంగరాలాడుతున్నారు పిల్లలు. కలవారి బతుల్లాగా—దర్జాగా తలలెత్తుకు తిరుగుతున్నాయి బొంగరాలు.

బజారువీధిలోకి వచ్చారు బాలయోగి.

నాగరిక జీవితానికి అవశ్యకములైన వస్తువుల జాబితాలాగా—కోకదుకాణంముందర క్యూలాగా— దరిద్రుడి నిట్టూర్పులాగా—పాలులేని చంటిపాప ఏడుపులాగా—పొడుగ్గా వుంది బజారు అంగళ్ళలో గల్లాపెట్టెలముందర కూర్చున్న వర్తకుల అత్యాశలాగా—విశాలంగా వుంది.

రోడ్డునిండాజనం! ఒడ్డును ఒరుసుకుంటూపారే ప్రవాహంలా కదిలిపోతున్న జనం! ఒకరినొకరు నెట్టుకుంటూ—తోసుకుంటూ—ఒరుసుకుంటూ — అడ్డుపడుతూ — పక్కకుతప్పుకుంటూ—ఆగుతూ—సాగుతూ—అయస్కాంతంవైపు ఆకర్షింపబడే ఇనుపసూదుల్లా అంగళ్ళవైపు అంగలు వేస్తున్నజనం!

నాలుగువైపులా కమ్ముకున్న జనం రద్దీలో బాలయోగి పాదం నలిగిపోయింది.

మేజామీది గ్లోబు గిరగిర తిరుగుతూ కళ్ళముందు నిలిచింది

...ఇరుకు ప్రపంచం!

రెండోపాదం మోపటానికి చోటులేని ప్రపంచం!

ఈజనమంతా ఎక్కడికి పోతున్నారు? ఎందుకు పోతున్నారు?

సిటిలో గాలంవేసి ఏటొడ్డున కూర్చున్న బెస్తవాళ్ళలాగా—దొంగజపంచేస్తూ నుంచున్న కొంగల్లాగా—వట్టడవిలో చిక్కుకున్న పరదేశిచుట్టూ చేతులు కూర్చుకుని నృత్యంచేసే నరమాంసభక్షకుల్లాగా—రోడ్డుకు యిరువైపులా అంగళ్ళు!

అంగళ్ళు! అంగళ్ళు! అంగళ్ళు! అంగళ్ళు

హోటల్ ముందర నిలబడ్డాడు బాలయోగి.

హోటల్‌నిండా జనం —లోపలికి వెడుతూ — బయటికివస్తూ కుర్చీల్లోకూర్చుంటూ — కుర్చీలకోసం నుంచుంటూ — తింటూ —

తాగుతూ—సర్వర్లను పురమాయిస్తూ—త్రేన్చుతూ—చేతులు కడుక్కుంటూ—బిల్లు చెల్లిస్తూ...

...కడుపులో పేగులు కుయ్యిమన్నాయి.

తోటరాముడిమీద కలవరం పెట్టుకుని పుల్లలా చిక్కిపోయిన రాకుమారి పాత ఒడ్డాణం పెట్టుకుంటే ఎలా దిగజారిపోతుందో, అలా కిందికి జారింది బాలయోగి నిక్కరు. వాడు దాన్ని పైకి లాక్కుని మెలితిప్పి ముడివేసుకుని, ముందుకు నడిచాడు.

బట్టల దుకాణాలముందు రకరకాల బట్టలు ఇంద్రధనుస్సుల్లాగా వేలాడుతున్నాయి. నాణ్యమైన చీరలకోసం ప్రాణాలిచ్చేసిన సుందరీమణుల్లాగా—అందమైనబొమ్మలు రంగురంగుల చీరల్లో బందీలై వుంచున్నాయి.

...ఇదిగో కిరాణా కొట్టు! మూటలు మూటలు! రాసులు రాసులు!

ఒకడు బస్తా బియ్యం కొంటున్నాడు. మరొకడు అరవడి పప్పుమాకలు కొంటున్నాడు.

ఒకడు డబ్బా నూనె కొంటున్నాడు. మరొకడు 'పావలా నూనియ్యి బాబూ!' అని గంటసేపట్నుంచీ ఘోషిస్తున్నాడు.

ఒకడు పదిశేర్ల పప్పు కొలవమంటున్నాడు. మరొకడు పడి ఉప్పు అడుగుతున్నాడు.

సెట్టిగారు ఒకడికి కుర్చీచూపి కూచోమంటున్నాడు. మరొకణ్ణి 'కాసేపాగు' అని కసురుకుంటున్నాడు.

...ఫ్యాన్సీ షాపుముందర నిలబడ్డాడు బాలయోగి.

బొంగరం తాడు కొనుక్కుంటే బాగుణ్ను! పదిపైసలు?... దేవుణ్ణడగాలి! దేవుడి దగ్గిర వుందో, లేదో?

స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు—ప్లాస్టిక్ సామానులు—పౌడరు డబ్బీలు—స్నో సీసాలు—టూత్ పేస్టులు—టూత్ బ్రష్‌లు—హేరాయిల్ సీసాలు — తిలకంబుడ్డీలు — నెయిల్ ' పాలిష్‌లు — జడకుచ్చులు — బ్రాసరీలు — సెంటుబుడ్లీలు — సిగరెట్ ప్యాకెట్లు...

వాటికోసం ఎగబడుతున్నారు జనం. అది కావాలి, ఇదికావాలి అంటూ తలారి రాముడి సంతానంలా మునురుకుంటున్నారు.

కొట్టుముందర తొక్కిసలాడుతూవున్న గుంపులోంచి ఓ గుండ్రటి నాణెం టంగుమంటూ అరుగుమీదపడి, అక్కణ్ణుంచి రోడ్డుమీదపడి, చితికిపోయిన గోళంలా—చీల వూడిన బండిచక్రంలా దొర్లుకుంటూ వచ్చి శరణు మహాప్రభో అంటూ బాలయోగి పాదాల నడుమ కూలిపోయింది.

బాలయోగి కళ్ళు రెండూ కొత్త అర్ధరూపాయి బిళ్లలా మెరిశాయి.

అది అర్ధరూపాయి బిళ్ల! దేవుడు పంపాడు!

వాడు చుట్టూ చూశాడు. ఎవరూ గమనించలేదు.

కొట్టు ముందరున్న గుంపువైపు చూశాడు.

ఎవరూ వెతుక్కోవటంలేదు.

కాస్సేపు అలాగే నిలబడ్డాడు బాలయోగి.

ఎవడు పారేసుకున్నాడో, పాపం! ఈ అర్ధరూపాయితో వాడు ఏదో ఒక దండగ వస్తువును కొన్నా ఒకటే, ఈ అర్ధరూపాయిని పోగొట్టుకున్నా ఒకటే!

బాలయోగి వంగి ఆ నాణెం చేతి కందుకున్నాడు.

వాడి గుండెలు గుబగుబమన్నాయి. వెనక్కి తిరిగి గబగబా అంగలువేస్తూ ఇంటిదారి పట్టాడు.

ఈ డబ్బును ఏం చెయ్యాలి?

చిల్లర మార్చి యాభైమంది బిచ్చగాళ్ళకు యాభై పైసలు దానం చేద్దామా?

వాళ్ళకేం, మహారాజులు! ఒక్కొక్కపైసా చొప్పున అడుక్కుంటూ, పొద్దుపోయేసరికి రెండు రూపాయలన్నా సంపాదిస్తారు. తను అడుక్కోలేదుకదా? తన కెవరిస్తారు యాభైపైసలు? తాను వాళ్ళకు దానంచేస్తే ఎంత, చెయ్యకపోతే ఎంత?

ఊళ్ళో మంచి సినిమా ఆడుతోంది. కలర్ పిక్చరు! ఎక్కడెక్కడో ఆడి, ఇప్పుడీ వూరొచ్చింది. అందులో వాణిశ్రీ వుంది. నాగేశ్వరావున్నాడు. నాగభూషణం వున్నాడు. అల్లు రామలింగయ్య వున్నాడు. రమాప్రభ వుంది. రాజబాబున్నాడు. భలేభలేపాటలున్నాయి.

సినిమాకు వెడితే?

ఔను. సినిమాకే వెళ్ళాలి! చూచిన వాళ్ళంతా మళ్ళీ మళ్ళీ చూస్తున్నారు. తాను ఒక్కసారైనా చూడకపోతే ఎలా? చూడాల్సిందే!

బాలయోగి నడకవేగం పెంచాడు.

వాడి ఆలోచన బొంగరం తాడుమీదికి వెళ్ళింది.

బొంగరం తాడు కొనుక్కుంటే, సినిమాకు డబ్బు చాలదు. వద్దు! సినిమాకే వెళ్ళాలి.

గంటమోగిస్తూ మిఠాయిబండి ఎదురుపడింది. లడ్డూలు! మైసూరు పాకులు! హల్వా! బాదుషా! కారాలు! పకోడీలు!... నోట్లో నీళ్ళూరింది.

'పకోడీ పొట్లం ఒకటివ్వు' అని నోటిదాకా వచ్చినమాట, నోట్లో వూరిన నీళ్ళల్లో కరిగిపోయింది.

పకోడీలు కొనుక్కుంటే, సినిమాకు డబ్బుచాలదు. వద్దు! సినిమాకే వెళ్ళాలి.

నాన్నకొచ్చే జీతంతో అన్నీ రావుకదా? అలాగే ఈ అర్ధ రూపాయితో అవ్వా బువ్వా అన్నీరావు. ఏదో ఒక్కటి మాత్రమే!

'టైమెంత సార్?'

'ఆరూ, పది!'

'ఓ యబ్బో! సినిమా మొదలవటానికి యింకా బోలెడంత టైముంది. పరవాలేదు.

'బూచాడమ్మా బూచాడు—బుల్లి పెట్టెలో వున్నాడు'

*  *  *

బాలయోగి యింటిని సమీపించేసరికి సంజ చీకట్లు ముసురు కుంటున్నాయి—కన్నెపిల్లల గుండె తలుపులుతట్టే చిలిపి కోరికల్లా తెరలుతెరలుగా.

కిటికీ దగ్గర స్టూలువేసుకుని వీధిలోకి చూస్తూ కూర్చుని వుంది ఆశాప్రియ.

సంజచీకట్లు అంటే ఆమెకు చెప్పలేనంత యిష్టం. నిద్ర లేచినప్పటినుంచీ సంజవేళకోసం ఎదురుతెన్నులు కాస్తూ వుంటుం దామె.

ఆమెకు పద్దెనిమిదేళ్ళ పడుచుదనం వుంది. ఆ పడుచుదనాన్ని ముస్తాబు చెయ్యాలన్న కోరిక కొండంత వుంది. అయితే ముస్తాబు చేసుకోటానికి ఏమీలేదు. ఆమెకు ముక్కుబోసి. మెడబోసి. చెవులు బోసి. చేతులు బోసి. బట్టలుమాత్రం రెండే రెండు జతలున్నాయి. అవి కూడా చిరిగిపోయి, మాసికలు కుట్టినవి. తలకు చమురు ఒకప్పుడు వుంటుంది, ఒకప్పుడు వుండదు ఫేస్ పౌడరు కూడా అంతే!

అయినా, సంజవేళ ఆ కిటికీ దగ్గర అలా కూర్చునేముందు 'ముస్తాబు' చేసుకోవటం మాత్రం మానదు ఆశాప్రియ. ముఖం రుద్దుకుంటుంది. తల దువ్వుకుని, రంగువెలిసిన రిబ్బనుపెట్టి జడ వేసుకుంటుంది. నీళ్లతో పిండి ఆరబెట్టుకున్న వోణీ పైనవేసు కుంటుంది. నుదుట బొట్టుపెట్టుకుంటుంది. చెరిగిపోని బొట్టు లాగా—చెదిరిపోని ముంగురుల్లాగా—కిటికీ దగ్గర కదలకుండా కూర్చుం టుంది.

అలా కూర్చున్నప్పుడు—చెల్లి ఏడుస్తున్నా, తమ్ముళ్ళు అల్లరి చేస్తున్నా, తల్లి రుసరుసలాడుతున్నా, ఇంటికప్పులు కూలి నెత్తిన పడబోతున్నా పట్టించుకోదు. అలంకారాలకు, ఆభరణాలకు నోచుకోని శరీరంలో మణిదీపాల్లా అమరిన చేరెడు కళ్ళతో వీధిలోకి—అమ్మవారి విగ్రహంలా రెప్పలార్పకుండా చూస్తూ వుంటుంది.

వీధిలో కోరమీసాల కోడెవయసు చిన్నవాళ్ళు వెడుతుంటారు, ఆ కిటికీముందునుంచి.

కన్నార్పకుండా చూసేవాడొకడు.

కూనిరాగం తీసేవాడొకడు.

ఈలపాట పాడేవాడొకడు.

పెదవుల ధనుస్సులో నవ్వులబాణాలు సంధించేవాడొకడు.

కన్నుగీటేవాడొకడు.

గాలిలో ముద్దులు వెదజల్లేవాడొకడు...

ఆశాప్రియ మూతిముడుచుకోదు. అలా అని ముఖం చేటంత చేసుకోదు.

వాళ్ళఅల్లరిఅంటే ఆమెకు ఎంతో ఇష్టం!

అమృతం—ఆ యింటి ఇల్లాలు—అల్లరిచేసే అబ్బాయిల్ని చూస్తూ ముద్దులా కూర్చున్న కూతుర్ని, దీపంపెట్టి తిడుతూ వుంది. 'సిగ్గూ శరం లేని ముండ! బోగందానిలా ఆ కిటికీదగ్గర అలా కుర్చోటం ఏమిటే, ఆ చూపులేమిటే? ఏండ్లొస్తేసరిపోయిందీ, గాడిద కొచ్చినట్లు? అక్కణ్ణుంచి లేచొస్తుందా చూడూ...'

తల్లి అలా చీవాట్లు పెడుతూంటే, ఆశాప్రియ కిటికీ

దగ్గరనుంచి లేచిపోయింది కిటికీవైపు మళ్ళీ ఓమారుచూచి, తళ్ళి చీవాట్లను గాలికి వొదిలేసింది. నిట్టూరుస్తూ మూగబొమ్మలా కూర్చుంది

వాకిట్లో నిలబడ్డాడు బాలయోగి బయటినుంచే 'అమ్మా, అమ్మా!' అని పిలిచాడు. కిడికీవైపు తొంగిచూచి 'అక్కా! నేను సినిమాకెళ్ళున్నాను. అమ్మతో చెప్పు!' అనేసి యింకోమాటకోసమైనా ఆగకుండా తారాజువ్వలా పరుగందుకున్నాడు.

సినిమాకెళ్ళున్నానని అమ్మతో ముందుగా చెప్పినా ప్రమాదమే! చెప్పకపోయినా ప్రమాదమే!

చెప్పకుండా వెళ్ళొస్తే, 'చెప్పకుండా ఎందుకు వెళ్ళావ్ ?' అని మూతిమీద పొడిచినా పొడవ్వచ్చు!

ముందుగా చెబితే, 'డబ్బెక్కడిదీ ? ఇలా తే!' అని లాగేసుకున్నా లాగేసుకోవచ్చు!

అందువేత, నొప్పింపక తానొవ్వక తప్పించుకు తిరుగువాడు ధన్యుడుసుమతీ అని పుస్తకంలోరాసినట్లు—'అమ్మా, సినిమాకెళ్ళున్నా' సంటూ ఆకాశవాణిలా కేకేసి, గుమ్మంలోనే అంతర్ధానమైపోయాడు బాలయోగి.

మాంసం దొంగిలించిన కుక్కలా పరిగెత్తి, సినిమారోడ్డు అందుకున్నాడు.

అన్నిరోడ్లకంటే వెడల్పుగావుంది సినిమారోడ్డు. సినిమాకు జనం గుంపులుగుంపులుగా — రోడ్డుపట్టనంత రద్దీగా వస్తారనో ఏమో —అది అంత వెడల్పుగా ఉంది!

బాలయోగి యాంత్రికంగానే నడుస్తూ సినిమా థియేటర్ చేరుకున్నాడు. సినిమా బుకింగ్ దగ్గర టిక్కెట్లకోసం ఎగబడుతూన్న జనసందోహాన్ని చూడగానే, వాడి ఆశ నీరుగారిపోయింది.

తేనెటీగల్లా కమ్ముకున్న జనంలో కౌంటర్ ఎక్కడుందో కనిపించటంలేదు. ఒక్కచేయి మాత్రమే పట్టే ఆ కౌంటర్ కంత ఎలావుంటుందో ? అందులో యిప్పుడు నాలుగైదు చేతులు యిరుక్కుపోయి వూడిరావటానికి తంటాలు పడుతుంటాయేమో !

రద్దీకి దూరంగా నిస్సహాయంగా నిలబడ్డాడు బాలయోగి.

తోసుకుంటూ - తొక్కుకుంటూ — కుమ్ముకుంటూ— కొట్టుకుంటూ - నెట్టుకుంటూ - తిట్టుకుంటూ - పంచెలు జార్చుకుంటూ- చొక్కాలు చింపుకుంటూ — జుత్తు పీక్కుంటూ—చొంగలు కార్చుకుంటూ—చెప్పలు తెంపుకుంటూ—చెమటలు కార్చుకుంటూ—భుజాల మీద నడిచిపోతూ—పిట్టగోడమీది కెగబాకుతూ ప్రాణాలను పణంగ పెట్టి, టిక్కెట్లకోసం విరగబడిపోతున్న జనం!

బలం వుంటేనే బతుకు!

బలం లేనివాడు పుడమితల్లికి కడుపుచేటు

నాలుగు థియేటర్లు నింపటానికి సరిపోయేటంత జనం —ఒక థియేటరు దగ్గర మోహరించి విజయమో. వీరస్వర్గమో తేల్చుకోటానికి తలపడుతున్నారు.

మనిషిలో ఆశ రెచ్చిపోతే, వివేకం చచ్చిపోతుంది టిక్కెటు కోసం ప్రయత్నం చెయ్యాలనుకున్నాడు బాలయోగి అర రూపాయి నాణెం చేత్తో పట్టుకుని, వెళ్ళి — గుంపువెనక నిలబడ్డాడు.

గుంపులోకి చొచ్చుకుపోవడం సాధ్యంకాలేదు కొండకొమ్ముననున్న లాకి పక్కదారి పట్టే పిల్లగాలిలా గుంపుచుట్టూ రెండుసార్లు తిరిగాడు. కొండను ఢీకొనే పొట్టేలులాగా మళ్ళీ ముందుకు కదిలాడు ఎగబడుతూ వెళ్ళి, అడ్డొచ్చిన రాతి గుండును అంటుకుని ఆగిపోయే జిల్లేడు గింజలా—కాళ్ళు నేలకు తన్ని గుంపును అంటిపెట్టుకున్నాడు. గుంపు ఒక్కుమ్మడిగా ముందుకు కదిలింది. బాలయోగి ముందుకు తూలాడు. ఒళ్ళు విరుచుకున్న రాక్షసిలా గుంపు మళ్ళీ వెనక్కి వేగంగా కదిలింది. బాలయోగి కాళ్ళు నలిగిపోయాయి వెనక్కి కదిలిన గుంపు వాణ్ణి వెనక్కి—వెనక్కి వెనక్కి నెట్టివేసింది

చావుతప్పి కన్ను లొట్టపోయి, దూరంగా వెళ్ళి నిలబడ్డాడు వాడు. చంద్రుడులేని ఆకాశంలా వెలవెలబోతూ వుంది వాడి చేయి ఆ చేతిలో అర్ధరూపాయి నాణెం లేదు గుంపులో జారిపోయింది

ఆ అర్ధరూపాయిని మళ్ళీ చేజిక్కించుకోవడం ఎలా? వెళ్ళి వెతికితే? గుంపు వెతుక్కోనిస్తుందా? 'మేం తొక్కులాడుతూ వుంటాం, నువ్వు వెతుకులాడుతూ వుండు' అంటారు వాళ్ళు ఎవరి పని వాళ్ళు చేసుకోవటానికి అభ్యంతరం ఏముంది ?

అయితే, ఆ గుంపులో దూరి, వాళ్ళ పాదాలకింద ఎక్కడో కూరుకుపోయిన ఆ అర్ధరూపాయిని వెతికి తేవటం హనుమంతుడికైనా చేతకానిపని.

థియేటర్‌లో పై కప్పులు తగిలేవరకు జనాన్ని కుక్కి,

బుకింగ్ మూసేశారు గేట్లు మూసేశారు. సినిమాలో కూర్చున్నంతమంది గేటు బయటే మిగిలిపోయారు. యుద్ధంలో చిత్తుగా ఓడిపోయిన వాళ్ళలాగా తలలు వాలేసుకుని, ఆశల ఊపిరిపోయి పీనుగుల్లై పోయిన గుండెల్ని మోసుకుంటూ ఆ పరిసరాలను విడిచి వెళ్ళిపోయారు. వెళ్ళిపోతున్న వాళ్ళను చూచి నవ్వుతూ నుంచున్నారు, వాల్‌పోస్టర్లలో వాణిశ్రీ, నాగేశ్వరావులు.

బాలయోగి కౌంటర్‌ముందర అటు పదిగజాలు, ఇటు పది గజాలమేర దుమ్ములో కెలికాడు. అంగుళంమేర కూడా విడిచిపెట్టకుండా ఓపిగ్గా అరగంటసేపు వెతికినా, అర్ధరూపాయి కనిపించలేదు. ఏమైపోయింది? ఉంటుంది! ఇక్కడే! ఈ దుమ్మంతా బండకెత్తించి ఇంటికి తీసుకుపోయి జల్లెడ పట్టిస్తే, అప్పుడు దొరుకుతుందేమో!

వాడు వెతకడం విరమించుకుని, చేతులు దులుపుకున్నాడు.

సినిమాకి టిక్కెట్టు దొరికివుంటే బాగుండేది.

అసలు సినిమాకే రాకుండా వుంటే బాగుండేది. ఆ అర్ధరూపాయికి బొంగరంతాడు, పకోడీ పొట్లం కొనుక్కుని వుంటె బాగుండేది.

ఆ అర్ధరూపాయి దొరక్కుండా వుంటే ఎంత బాగుండేది. అది దొరికిన డబ్బేగా ? ఎలా దొరికిందో అలాగే పోయింది. ఇదే బాగుంది.

వాడు సినిమా పోస్టర్లవైపు చూస్తూ, సినిమాలోంచి సన్నగా వినిపిస్తున్న మాటలూ పాటలూ వింటూ మరో అరగంట అక్కడే గడిపాడు.

ఇప్పుడు తెరమీద ఏం జరుగుతూవుంటుంది ?... పాట వినబడుతూవుంది. వాణిశ్రీ మగాడిలా చంకలెగరేసి ఆడుతూ వుంటుంది. నాగేశ్వరావు ఆడపిల్లలా నడుం తిప్పుతూ ఆడుతుంటాడు. వాళ్ళ ఆటలూ, వాళ్ళ పాటలూ చూడాల్సిందే! సినిమాతెరమీద వాళ్ళిద్దరూ తిరిగే ప్రపంచం ఎంత విశాలమైనది! సినిమా కౌంటర్ దగ్గర వుండిన రద్దీ, తొక్కిసలాట అక్కడలేవు. విశాలమైన మైదానాలు! సుందరమైన నందనవనాలు! ఒకరికొకరు దొరక్కుండా యింట్లోనే పరుగులు తీయటానికి చాలినంత పెద్దపెద్ద మేడలు! ఆ మేడలో,—ఆ ఉద్యానవనాలో —ఆ మైదానాల్లో వాణిశ్రీ, నాగేశ్వరావూ తప్ప మరెవ్వరూ కనిపించరు. ఈ రద్దీ, ఈ ఇరకాటం, ఈ గిలగిల, ఈ విలవిల - అక్కడ మచ్చుకైనా లేవు. అది మరో ప్రపంచం మన ప్రపంచానికంటే లక్షరెట్లు పెద్ద ప్రపంచం అందులో కనిపించే ఆ యిద్దరూ ఆకలిదప్పులను గురించి ఎప్పుడూ పట్టించుకోరు. ఎప్పుడూ ఆటలే! ఎప్పుడూ పాటలే! వాళ్ళకు నవ్వులేగానీ, ఏడ్పులు లేవు. అథవా ఎప్పుడయినా ఏడిస్తే, ఆ ఏడుపు కూటికోసంకాదు. గుడ్డకోసంకాదు. బ్రతకటానికి చోటులేదనికాదు. ఎడబాటు సహించలేక!... వాళ్ళకు ఓ బుల్లిపాపాయి వుంటాడు. వాడికేంతక్కువ ? అదృష్టమంటే వాడిదేకదా ?

ఆ మరో ప్రపంచంతో జీవితాన్ని ఊహించుకోవడమంటే బాలయోగికి ఎంతో సరదా. తాను ఆ వాణిశ్రీ కడుపులో పుడితే ఎంత బాగుణ్ను! వాణిశ్రీ ఒడిలో మురిపెంగా కూర్చుని, నాగేశ్వరరావు ముక్కుపట్టుకుని లాగొచ్చు!... ప్చ్! బ్రతుకు సినిమా కాదుగదా!

వాల్‌పోస్టర్‌లోని వాణిశ్రీ. నాగేశ్వరావూ వాడివైపు జాలిగా చూశారు. బాలయోగి మురిసిపోయాడు.

సైరన్ 'గుయ్యి' మంటూ కూత పెట్టింది.

గంట ఎనిమిదయిందన్న మాట.

ఆకలి పంజా విప్పుకుంటోంది.

చలి గోళ్ళకు పదును పెట్టుకుంటోంది,

బాలయోగి ఇంటిముఖం పట్టాడు.

బస్‌స్టాండ్‌లోంచి తలకుమించిన బరువును మోసుకుంటూ చివరి బస్సులు కదిలి వెళ్ళిపోతున్నాయి. బస్సులనిండా జనం! వెళ్ళిపోతున్న బస్సులవైపు చూచి నిట్టూరుస్తూ — బస్‌స్టాండ్ నిండా జనం!

o o o

తలుపు మూసి వుంది.

బాలయోగి వాకిట్లో నిలబడి మెల్లగా తలుపు తట్టాడు.

'కంచాలెందుకురా అలా కొడతారు ? ఈ చట్టీతీసి నెత్తిమీద,,' అమృతం గొంతు హఠాత్తుగా ఆగిపోయింది, కట్ అయిపోయిన సినిమాలాగా! నిశ్శబ్దం ఆ యింటి గొంతుకనే నొక్కేసింది.

'టక్—టక్—టక్—టక్...'

తలుపు తెరుచుకోలేదు.

బాలయోగి ముందుకు వంగి తలుపు సందులోంచి లోపలికి

చూశాడు వాకిలికి నేరుగా వున్న వంటగదిలో ఖాళీ కంచాల ముందు కూర్చుని వున్నారు రోజారమణీ, రాజా. అమృతం తలుపువైపు చూస్తూ, చేతిలో చట్టితో నిలబడింది.

'టక్—టక్—టక్—టక్ .'

'ఎవరూ ?' అంది అమృతం.

'టక్—టక్ - టక్—టక్. .'

ఆమె చట్టి కిందపెట్టి తిన్నగా నడిచి వచ్చింది. తలుపు తీసి పక్కకు ఒదిగి నుంచుంది.

బాలయోగి లోపలికి దూరాడు.

'ఓరి కొరివి దెయ్యం ! నువ్వా !... అప్పుల వాళ్ళేమోనని హడలి చచ్చాను. మూగెద్దులాగా అలా తలుపు కొట్టకపోతేనేం ? నోరు లేదూ నీకు ?' అంటూ వాడి తలమీద లాగి మొట్టికాయ వేసి మళ్ళీ తలుపు మూసింది అమృతం.

ఆ యింటికి సాయంకాలం నుంచీ తీర్థ ప్రజలాగా వచ్చివెళ్తున్నారు అప్పులవాళ్ళు.

పెద్ద అప్పులవాళ్ళు బెదిరించి వెళ్ళారు.

చిన్న అప్పులవాళ్ళు చీవాట్లు పెట్టి వెళ్ళారు.

ఇల్లు ఖాళీ చెయ్యండని యిప్పుడే చెప్పి వెళ్ళాడు, ఇంటద్దె వాడు.

అన్నీ విని చచ్చిన పీనుగులా వూరుకుంది అమృతం.
ఆమెకంటే చచ్చినపీనుగే మేలు !

పీనుగు పువ్వులు కురిశాయని పొంగిపోదు, ముళ్ళు గుచ్చుకున్నాయని కృంగిపోదు.

పూలవాన లేకపోతే పీడపోయింది, ముళ్ళు గుచ్చుకుంటే తుళ్ళిపడకుండా వుండదే ఈ వెధవ ప్రాణం !

'ఏం, సినిమాకు పోతానన్నావే—పోలేదా ?' అని అడిగిందామె కొడుకును.

'లేదు ' అన్నాడు బాలయోగి.

'డబ్బెవరిచ్చారు ?'

'బజార్లో దొరకింది అర్ధరూపాయి.'

'ఏదీ, యిలా యివ్వు !' అంటూ చేయి జాచిందామె.

'ధారపోయింది !'

చాచిన చేత్తోనే మళ్ళీ ఓ మొటికాయ వేసింది అమృతం. కాళ్ళు కడుక్కుని రా, కడుపు చించుకుందువుగాని!' అంది.

కాళ్ళు కడుక్కునివచ్చి కంచంముందు కూర్చున్నాడు బాలయోగి.

చింకి చాపను వొదిలితే జీవించలేనన్నట్టు పడుకుని వుంది ఆశాప్రియ.

'నువ్వూ లేచి రావే! ఒక కడి నోట్లో వేసుకొందువు .:' అని కేకేసింది అమృతం.

'నా కొద్దు. ఆకల్లేదు' అంది ఆశాప్రియ.

ముందరున్న సంగటి చట్టిలోకి తొంగిచూశాడు బాలయోగి. అందులో ఒకటిన్నర ముద్ద సంగటి వుంది ! ఒక ముద్ద భూగోళం ! అర ముద్ద చంద్రగోళం ! తాకి చూచాడు. చల్లగా వుంది.

'మధ్యాన్నం చేసిందా'? అని అడిగాడు.

'ఏం ? గొంతు పట్టుకుంటుందా ? చెయ్యిత్తియ్'! అంటూ కసిరింది అమృతం.

ఆమె భూగోళాన్ని చేతికి తీసుకుంది. దాన్ని మూడు ముక్కలు చేసి ముగ్గురి కంచాల్లో పంచింది. చింతపండు పచ్చడి వేసింది. ఆవురావురుమని తిన్నాడు బాలయోగి ఆకలి తీరలేదు.

భూగోళం ముగ్గురికి చాల్లేదు !

ఒకడికి సరిపోతుంది. ముగ్గురికి చాలదు.

కోటి మందికి సరిపోతుంది మూడు కోట్ల మందికి చాలదు

నూరు కోట్ల మందికి సరిపోతుంది మున్నూరు కోట్ల మందికి చాలదు.

చాలదంటే అమ్మ తిడుతుంది. తిట్టినా ఇంకొంచెం పెడుతుంది. అయితే మిగిలివున్నది చంద్రగోళమే కదా ? అమ్మ, నాన్న, అక్కయ్య అందరూ దాన్నే పంచుకోవాలి గదా ?

బాలయోగి చెయ్యి కడుక్కున్నాడు.

చంద్రగోళాన్ని తీసి మూకుట్లో దాచిపెట్టింది అమృతం, సంగటి చట్టిలో నీళ్ళుపోసి గోకి, ఉప్పువేసి కలిపింది. లోటాలోకి వొంచి, 'దీన్ని అక్క కివ్వురా బాలిగా !' అంది.

'నాకొద్దురా ! తీసుకుపో !' అంది ఆశాప్రియ.

అమృతం ఆ రెండులోటాలనిళ్ళూ ఎడగుటూ తాగేసి

కుండలూ కంచాలూ కడిగిపెట్టింది.

పిల్లలంతా పడుకున్నారు

చింకిచాపలు పరుచుకుని, చింకిపేలికలు కుక్కికుట్టిన తలగడలు వేసుకుని, చింకి దుప్పట్లు కప్పుకుని పడుకుంటారు ఆఇంట్లో, అందరూ ! దుప్పట్లు అందరికీ చాలినన్ని లేవు గనుక పాతకోకలు కూడా కప్పుకొంటారు

పడుకుంటే ఆ యిల్లు అందరికీ యిరుకాటం !

చక్రపాణి ఈ మధ్య యింట్లో పడుకోవటంలేదు వాడసలు యింట్లో పొత్తిగా వుండడమేలేదు ఎప్పుడో వస్తాడు వచ్చినవాడు వచ్చినట్టే, ఎక్కడికో వెళ్ళిపోతాడు

తొమ్మిదో తరగతి పూర్తి కాకుండానే, చదువుకు సున్న పెట్టారు చక్రపాణి ఆకలితీరని కడుపుతో, అసహ్యమైన బట్టలతో నైరాశ్యం నిండిన కళ్ళతో, న్యూనత నిండిన మనసుతో వాడు బడికి వెళ్ళలేకపోయాడు తప్పుదార్లు తొక్కాడు పేకాటగాళ్ళకు, తాగుబోతులకూ నమ్మినబంటయ్యాడు.

అన్నయ్యకు అలా ఆంబోతులా ఊరుమీద తిరిగే అలవాటు లేనప్పుడు—ఈ యిల్లు యింతకంటే ఇరకాటంగానే వుండేది.

బాలయోగి, రోజారమణి, రాజా—వరసగా ఒకే చాపమీద పడుకుంటారు. ముగ్గురూ ఒకేదుప్పటి కప్పుకుంటారు

రాజా అప్పుడే నిద్రపోయాడు

రోజారమణి కళ్ళ మీద యిప్పుడిప్పుడే నిద్ర ముసురుకుంటోంది.

బాలయోగి కళ్ళు—తొక్క వొలిచిన అరటిపండులా విచ్చుకునే వున్నాయి

గోడమీద మేకుకు తగిలించిన కోడిగుడ్డు దీపం అర్రాకలితో నీరసంగా వెలుగుతోంది

ఆ ఇంట్లో కరెంటులైట్లు లేవు కరెంటు లైట్లకంటే మరెంతో అవసరమైనవీ, వాళ్ళకు అందుబాటులో లేనివీ — లెక్కపెట్టలేనన్ని ! కనుక వాళ్ళకు కరెంటు దీపమైనా ఒకటే, కిరసనాయిలు ధూపమైనా ఒకటే !

నాన్న యింకా రాలేదు జీతాలరోజున అర్ధరాత్రి దాటితేగానీ యింటికిరాడు నాన్న, అప్పులకు భయపడి !

అమృతం గోడవైపు తిరిగి నుంచుని కిందికీ పైకీ చూస్తూ ఏమిటో గొణుక్కుంటోంది.

గోడలనిండా పెన్సిల్‌గీతలు—దుమ్మునేలమీద బాతులగుంపు నడిచిపోయిన గుర్తుల్లాగా

ఆమెకో పాత పెన్సిల్‌ముక్క వుంది దాన్ని ఎవ్వరూ తాకరు అది వంటింటిగూట్లో భద్రంగా వుంటుంది ఆమె తన సంసార భారాన్నంతా ఎప్పటికప్పుడు ఆ ఇంటిగోడలమీది కెక్కిస్తూవుంటుంది ఆ పెన్సిల్‌ముక్కతో జీతాలు వచ్చినరోజున అలా ఆ గోడలదగ్గర నిలబడి ఆ బరువులన్నిటినీ తూచి మూటలుగట్టి పెడుతుంది — పాలమనిషికింత, కూరలబ్బికింత, చాకలికింత, పిడకలదానికింత, పొరుగువాళ్ళకింత- అంటూ

బాలయోగి లేచి అమెవెనక నిలబడ్డాడు.

ఆమె అన్నిలెక్కలూ సరిచూసుకుని, మళ్ళీ అందరి బాకీలూ వరసగా వేసి మొత్తం కూడుకుంటోంది కూడిక పూర్తిచేసి గుండెమీద చేయివేసుకుని 'అమ్మో ! ఇంతయిందా !' అంది బెంగగా

ఆమె బెంగలో యింకొంచెం బరువు వేశాడు బాలయోగి. 'నీ కూడిక తప్పే, అమ్మా ! ఇంకా ఇరవైరూపాయలు ఎక్కువ రావాలి ! పదులస్థానంలో రెండు వేసుకోవటం మరిచిపోయావు.'

ఆమె మళ్ళీ కూడింది మరోసారి కూడింది. 'ఔను ..' అంది అయితే ఆ సంఖ్యను దిద్దకుండా అలాగే నిలబడిపోయింది. ఆమెచెయ్యి చచ్చిపోయింది.

మరో నిమిషం అలాగే పిచ్చిదానిలా గోడలవైపు చూచి, గొణుక్కుంటూ వెళ్ళి రాజాపక్కన మేనువాల్చింది. 'పడుకుని నిద్ర పోరాదట్రా ?' అంది చిరచిర లాడుతూ.

బాలయోగి పడుకుని ముసుగుతన్నాడు పడుకున్న వెంటనే రాదు నిద్రవాడికి. పడుకున్న తరవాత చాలసేపు ఆలోచనల్లో కొట్టుకుపోతాడు. ఆ ఆలోచనల్లోనే నిద్రపోతాడు.

పక్కన నిద్రపోతున్న రోజారమణి కిలకిలా నవ్వింది — శ్రుతి పెట్టిన వీణమీద ఎలుకదూకి తంత్రులు మోగినట్లు !

బాలయోగి ముసుగు తొలగించాడు. పక్కకు పొర్లి చెల్లెలి ముఖంలోకి వంగి చూశాడు. మంచులో—ముడుచుకున్న మొగ్గలా నిద్రపోతోంది రోజా.

మెల్లగా పిలిచాడు, 'రోజా !'

'ఊఁ !'

'ఎందుకే నవ్వుతున్నావు ?'

'కొత్తగౌను ' నీటిలోంచి చెంగున పైకి గెంతి మళ్ళీ లోపలికి జారిపోయే బంగారుచేపలా—ఆమె పెదాలమీద లాస్యం చేసింది

ఆ ఒక్కసూకే !

'ఎవరిచ్చారు కొత్తగౌను?' అని అడిగాడు మళ్ళీ.

రోజాకు ఆ మాట వినిపించినట్లులేదు. హాయిగా నిద పోతోంది

ఇంకా ఏమైనా చెబుతుందేమోనని కాస్సేపు చూసి వెనక్కి వాలాడు బాలయోగి.

వెర్రినాగమ్మ ! కొత్తగౌను తొడుక్కుంటోంది, కలల్లో !
కలలు !

కంటినిండా కలలు !
బ్రతుకు నిండా కలలు !

కళ్ళు మూతలు పడగానే కొలలుగా ముసురుకునే కమ్మని కలలు !

కళ్ళు తెరవగానే కోసెడుదూరం పారిపోయి కోతిలా వెక్కి రించే కల్లబొల్లి కలలు !

బాలయోగి ఆలోచనలు బజారులోకి పరుగు తీశాయి. ఈ యింట్లో లేనివన్నీ అక్కడే వున్నాయి—మూటలు మూటలుగా, రాసులు రాసులుగా, బారులు బారులుగా, దొంతర్లు దొంతర్లుగా, తాన్లు తాన్లుగా, బేళ్ళు బేళ్ళుగా !

అక్కడికీ యిక్కడికీ ఎంత తేడా !

ఆ బజారునిండా వెలలే !

ఈ యింటినిండా కలలే ! ఈ యింటిలోని కుండలనిండా, డబ్బాలనిండా, పాత్రటంకులనిండా, ఓటి సీసాలనిండా, చిల్లి బేబుల నిండా—కిటకిటలాడుతున్న కలలే !

దొంతులన్నీ ఖాళీ ! డబ్బాలన్నీ ఖాళీ !

ఈ యింట్లో చారెడు బియ్యం వుండదు.

సోలెడు పప్పు వుండదు

పెరట్లోవున్న ఓటి సబ్బుపెట్టెలో సబ్బుబిళ్ళ వుండదు.

అందరి బట్టలకూ చిరుగులే !

దండెంమీద వేలాడుతూన్న మోాపెడుబట్టలూ పనికిరానివే !

పడుకోటానికి మంచిచాపలేదు.

కప్పుకోటానికి మంచిదుప్పటి లేదు.

నీళ్ళు పోసుకుంటే తుడుచుకోవటానికి తువ్వాలులేదు.

ఈ ఇంట్లో మట్టికడవలే ఇత్తడి బిందెలు !

చిల్లులుపడిన సత్తుగిన్నెలే సీలు పాత్రలు !

అమ్మ చెవులకు అరిగిపోయిన రోల్డుగోల్డు కమ్మలు !
ఆశా చెవులకు అదికూడా లేదు !

కంటినిండా కలలు !

గుండెనిండా గుబులు !

బాలయోగి కళ్ళు మూతలు పడాయి.

వాడి ఆలోచనలు ఆవలించాయి.

గిరగిర గిరగిర ...

ప్రపంచం తిరుగుతూంది !

...ఇదే ఆసియాఖండము. ఇదిగో భారతదేశము. అందులో బాలయోగి వాళ్ళయిల్లు యిదే ! దీనికే భారత ఎడారి అని పేరు. ఇచ్చట వర్షపాతము తక్కువ. పంటలు పండవు. ఇచ్చటి ప్రజలు కష్ట జీవులు.. ప్రభుత్వము ఈ ఎడారిని నందనవనముగా మార్చుటకు... ప్రభుత్వము .. నందనవనము... ఎడారి.

బాలయోగి నిద్రపోయాడు.

★ ★ ★

వేకువజామున మెలకువ వచ్చింది బాలయోగికి

రాజా లేచి కూర్చుని గుక్కపట్టి ఏడుస్తున్నాడు.

ఎవరూ పట్టించుకోవటంలేదు.

అందరూ నిద్రపోతున్నారు, మండుతూన్న కాష్టంమీద పడుకున్న పీనుగుల్లా.

ఆ యింట్లో అందరూ వేకువజామున ఒళ్ళుమరిచి నిద్ర పోతారు. ఆ సమయంలో పిడుగులుదొర్లినా పైకి లేవరు.

రాజా దగ్గరికి లేచివెళ్ళాడు బాలయోగి.

దుప్పటి తడిపేసుకుని, చలికి ఏడుస్తున్నాడు రాజా.

దుప్పటి చివరలు రెండూ తారుమారు చేసి తిరగేశాడు బాల యోగి. తమ్ముణ్ణి పడుకోబెటి దుప్పటిసర్ది, వాణి చిచ్చికొట్టాడు.

కాస్సేపటికి నిద్రపోయాడు రాజా.

బాలయోగి లేచి వెళ్ళి తన స్థానంలో పడుకున్నాడు

కడుపులో ఆకలి !

నరాల్లో చలి !

తనవైపు తిరగేసుకున్న తడి దుప్పటి కప్పుకోడానికి పనికి రావడం లేదు.

తడి తగలకుండా దూరంగా ఒత్తిగిలాడు.

ఎముకల్ని కొరికేస్తూ౦ది చలి.

కడుపులో కాళ్ళు ముడుచుకుని, చేతుల్లో ముఖం దాచుకున్నాడు.

లాభం లేదు.

చలి కొరికేస్తో౦ది. పాముకోరల్లా !

చలి కోసేస్తో౦ది. రంపంపళ్ళలా !

అబ్బబ్బ ! ఈ ప్రపంచంలో బ్రతకడం ఎలా ! చోటుచాలదు! గాలి చాల్లదు ! ఉంటానికి యిల్లు చాలదు ! తింటానికి తిండిచాలదు! కట్టుకోటానికి గుడ్డ చాలదు ! కప్పుకోటానికి దుప్పటి చాలదు !

చాలీ చాలని ప్రపంచం ! మట్టి మూకుడులో సంగటి ముద్ద లాంటి ప్రపంచం ! తాడు చాలని బొంగరంలా—తల్లకిందులుగా తిరుగుతో౦ది !

గిరగిర గిరగిర గిరగిర గిరగిర

నేలా నీళ్ళూ—గాలీ ధూళీ-మబ్బూ వానా—కొండా కోనా—వాగూ వంకా—చెట్టూ చేమా— చెరువూ దొరువూ—గొడ్డూ గోదా గడ్డీ గాదం—గిరగిర గిరగిర గిరగిర గిరగిర....

కడుపులో ఆకలి!

నరాల్లో చలి !

తనవైపు తిరగేసుకున్న తడిదుప్పటి కప్పుకోటానికి పనికి రావటంలేదు.

తడి తగలకుండా దూరంగా ఒత్తిగిలాడు.

ఎముకల్ని కొరికేస్తూ౦ది చలి.

కడుపులో కాళ్ళు ముడుచుకుని, చేతుల్లో ముఖం దాచుకున్నాడు.

లాభంలేదు.

చలి కొరికేస్తో౦ది, పాముకోరల్లా !

చలి కోసేస్తో౦ది, రంపంపళ్ళలా !

అబ్బబ్బ ! ఈ ప్రపంచంలో బ్రతకటం ఎలా ? చోటు చాలదు! గాలి చాలదు ! ఉంటానికి యిల్లు చాలదు! తింటానికి తిండి చాలదు! కట్టుకోటానికి గుడ్డ చాలదు! కప్పుకోటానికి దుప్పటి చాలదు!

చాలీచాలని ప్రపంచం! మట్టి మూకుడులో సంగటి ముద్ద లాంటి ప్రపంచం ! తడిసిపోయిన దుప్పటిలాంటి ప్రపంచం ! తాడు చాలని బొంగరంలా — తల్లకిందులుగా తిరుగుతో౦ది !

గిరగిర గిరగిర గిరగిర గిరగిర

నేలా నీళ్ళూ — గాలీ ధూళీ — మబ్బూ వానా — కొండా కోనా — వాగూ వంకా — చెట్టూ చేమా — చెరువూ దొరువూ — గొడ్డూ గోదా — గడ్డీ గాదం గిరగిర గిరగిర గిరగిర గిరగిర...

ఊరూ వాడూ — పల్లె పట్నం — మిట్టా పల్లం — మేడా గోడా — గిరగిర — గిరగిర — గిరగిర — గిరగిర...

ముసలీ ముతకా — పిల్లా పీచూ — గోచీ గిన్నే—కొంపా గంపా— గిరగిర గిరగిర గిరగిర గిరగిర...

...బాలయోగి కళ్ళు గిరగిరా తిరిగాయి. కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. మూతలు పడిన కళ్ళలో ప్రపంచం గిర్రున తిరుగుతో౦ది.

ప్రపంచం నిండా జనం! ఒడ్డును ఒడ్డును ఒరుసుకుంటూ పారే ప్రవాహంలా కదిలిపోతున్న జనం ! ఒకరినొకరు నెట్టుకుంటూ— తోసుకుంటూ — ఒరుసుకుంటూ — అడు పడుతూ — పక్కకు తప్పుకుంటూ — ఆగుతూ — సాగుతూ — అయస్కాంతంవైపు ఆకరి ౦పబడే ఇనుపసూదుల్లా అంగళ్ళవైపు అంగలువేస్తున్న జనం !

తోసుకుంటూ — తొక్కుకుంటూ — కుమ్ముకుంటూ — కొట్టుకుంటూ — నెట్టు కుంటూ — తిట్టుకుంటూ — పంచెలు జార్చుకుంటూ — చొక్కాలు చింపుకుంటూ — జుట్టు పీక్కుంటూ— చొంగలు కార్చుకుంటూ — చెప్పులు తెంపుకుంటూ — చెమటలు కార్చుకుంటూ — భుజాలమీద నడిచిపోతూ — తలకాయలమీద దొర్లిపోతూ — ప్రాణాలను పణంగాపెట్టి, టిక్కెట్లకోసం, సరకులకోసం విరగబడిపోతున్న జనం!

బాలయోగి తల తిరిగిపోయింది.

గిరగిర గిరగిర గిరగిర గిరగిర...

వాడి గుండెలోంచి సన్నటి ఏడుపు రెక్కలార్చుకుంటూ గొంతులోకి ఎక్కివచ్చింది. అప్పుడే గొంతు విప్పుకున్న కాకిపిల్లలాగా !

---

# కవిత్వం

## శ్రీ మేకా సుధాకరరావు

అగుపడే సుందర ఆకార వర్ణాలూ
అగుపడని తావీ
కలబోసుకుని విరిసిన
సుందర సురభిళ సుమం వలె —

కనుపించే చంద్రకాంతీ
కనపడని చల్లదనాల
కౌగిలింతలో విరబూసిన వెన్నెల వలె -

అక్షర రూపమైన భాషా,
అంతర్గత అదృశ్య రూపమైన భావమూ
పెనవేసుకున్న
ఐక్యరూప అర్ధ నారీశ్వరం, కవిత్వం !
సౌందర్యం, ఆనందం పాదాలుగా
భాషా సరస్సులో విహరించే
భావ మరాళం —
మంచి చెడ్డలూ, సుఖ దుఃఖాలూ
ధర్మా ధర్మాలూవంటి
పాలూ నీళ్ళూ వేరుచేసి అందిచ్చే
రచనా నైవేద్యం కవిత్వం !
సీతా వియోగ సంభారిత హృదయంతో
శ్రీరామ నయనాలు కురిసిన
ప్రేమాశ్రువులు కవిత్వం —
మాధవ నిరీక్షణలో పరవశించిన
రాధ నయన జ్యోతుల మెరిసే
దివ్య కాంతి కవిత్వం !

శ్రీరామ దర్శనోత్సవ మహదానందంలో
కలలు పండిన వృద్ధ శబరి
శిథిల నయనాలు వెలార్చిన
అశ్రు మౌక్తికాలు కవిత్వం
మానవతను వెలిగించే
యెద యెదనూ కదిలించే
'భిక్షూ వర్షీయసి' హీన చరిత
దీన గాథ, కవిత్వం !
భర్త తిరస్కారంతో
పరాభవానల దగ్ధ హృదయిని యైన
శకుంతల కనుల జారిన
రక్తాశ్రువులు కవిత్వం !
అక్షరాల ఇటకలు పేర్చి
పదాల సిమెంటుతో కూర్చిన
భావాల ప్రాణవాయువు వీచే
గదులూ వరండాలతో
నిర్మితమైన సుందరానంద మందిరం, కవిత్వం !
సమతా మమతా జలాల సంగమంగా
సర్వ జనుల హృదయాలూ చక్కబరచి ;
మానవతే పునాదిగా, మనుషులందరూ
సుఖ శాంతుల బ్రతికేలా
ఎల్లరనూ జ్ఞాన సంపన్నం గావించే
మేలుకొలుపు, కవిత్వం !

అన్యాయాక్రమాల అసుర సంపద అలుముకున్న
చీకట్లను చీల్చి చూపే వెలుగును
నీ కొసగే సవితా కిరణం కవిత్వం !
జీవనసారం కవిత్వం !
భావి తరాల జీవం కవిత్వం !

---

# బాలవ్యాకరణము-త్రిలింగలక్షణశేషము

## శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

చిన్నయసూరి క్రి శ 1806 లో జన్మించి క్రీ. శ. 1862 లో నిర్యాణము చెందెను. "సమగ్రమగు నొక నిఘంటువు, సుందర మగు నొక వచనగ్రంధము, నిష్కృష్టమగు నొకవ్యాకరణము ఈ మూఁడిటిని సంతరించుట సూరిగారి జీవితలక్ష్యము. అందు నిఘంటువు చాల మేరకు రచితమయినను నది ప్రకాశమునకు నోఁచుకొన్నది కాదు, సూరి స్వహస్త లిఖితమగు ఆ నిఘంటువు వ్రాతప్రతి చిర కాలము మదరాసుప్రాంతముల మాటువడియుండ నిటీవల కాకినాడ యందలి సూర్యారాయాంధ్ర నిఘంటు కార్యాలయమునకు ఎట్టెటో చేరినది, సూ రా నిఘంటు నిర్మాణమున మిక్కిలిగా నుపకరించినది మరల సూ. రా నిఘంటు చరమ భాగము మద్రపురియందు ముద్రిత మగు సందర్భమున తక్కిన గ్రంధములతోపాటు మదరాసునకు తరలింపఁబడినది. అచ్చోట హస్తలాఘవముగల యాషాఢభూతుల చేతికంది అట్టె యంతర్ధాన మొందినది. కాపటికు లెవ్వరో కాఁజేసినారు......"

ఈ యాంధ్రదేశమును విజ్ఞానవంతముఁగా జేసిన మహాప్రతిభా సంపన్నులకోవకుఁ జెందినవాఁడు చిన్నయసూరి. పదునాలేండ్లు వచ్చుదాఁక నిరక్షర కుక్షిగాఁ దిరిగిన చిన్నయ్య యాంధ్రభాషకు అనన్య సాధ్యమయిన వ్యాకరణమును రచించెను. ఆయన ప్రతిభ యెట్టిదో, శక్తియుక్తు లెట్టివో యీ క్రింది పల్కులు చాటఁగలవు

"ఇతి సకల భాషాకవికమలమిత్ర గార్గేయ సగోత్ర ఆపస్తంబ సూత్ర యజుశ్శాఖాధ్యాయి శ్రీ వేంకటరామానుజాచార్య పుత్ర, శ్రీనివాసాంబాగర్భశుక్తి ముక్తాఫలాయమాన, దిగంత విశ్రాంత చిరంతనకీర్తి విరాజమాన, సంస్కృతాది భాషాష్టక లక్ష్యలక్షణ జ్ఞాన ఘనపండిత జేగీయమాన, నిరంకుశ నిరర్గళధురీధారాలంకృత సంస్కృతాంధ్రభాషానుశాసన బహులక్ష్యలక్షణ గ్రంధరచనాధురీణ, సర్వదర్శన సంగ్రహ కుసుమాంజలీ మహాభాష్య శ్రీభాష్య భగవద్విషయ పాఠ ప్రవచన పారీణ. శాత్తాద శ్రీ వైష్ణవకులకలశాంబుధి పూర్ణ చంద్రేణ, ఆంగ రాజకీయ సర్వకళాశాలాంధ్రపండిత చిన్నయసూరిణా ప్రణీత గీర్వాణభాషారూపాంధ్రశబ్దానుశాసన సంజ్ఞాపరిచ్ఛేదః..."

ఈ మహాభాష్య పాఠ ప్రవచన పారీణుఁడు దాదాపు పదు నెనిమిదేండ్లపాటు అహోరాత్రము శ్రమించి పద్యాంధ్ర వ్యాకరణము, ఆంధ్రశబ్దానుశాసనము, సూత్రాంధ్ర వ్యాకరణము, శబ్దలక్షణ సంగ్రహము అను వానిని రచించిన తరువాత "...... నాలుగేండ్లు మరలఁ బరిశ్రమించి, పూర్వరచనములలోఁ దాను సేకరించి యుంచిన విషయము లన్నింటిలో ముఖ్యములు, అవశ్యజ్ఞాతవ్యములు నిష్కృష్టములు, నిరంతరావశ్యకములునగు ప్రధాన విషయము లెన్నుకొని, సూత్రస్వరూపమును క్రమవిన్యాసమునుమార్చి, లక్ష్యములు కూర్చి సర్వాంగ సుందరమయిన బాలవ్యాకరణమును" నిర్మించి క్రీ. శ. 1858లో ప్రకటించెను.

చిన్నయసూరి బాలవ్యాకరణము కేవలము కవిత్రయ భారత భాషకే సంబంధించినదిగాదు. "సూరి దృష్టి కందని భారత ప్రయోగము లుండుట ముక్కాలుమువ్వీసము అసంభవము" అనుట పరమ సత్యము. ఆయనకు ప్రాచీనాంధ్ర మహాకవు లందఱు ప్రామాణికులే మఱిమఱి పరికింప శబ్ద సాధుతా నిర్ణయమున ప్రయోగము భారతమునందలిదా? ప్రబంధములలోనిదా? ఏ కవిది? ఏ గ్రంధము లోనిది? ఏ శతాబ్ది లోనిది? అనికాదు సూరి దృక్పథము. ఏ శబ్దము, ఏ రూపముతో ఎంతమంది కవులకు రుచించినది? దేశము మొత్తమున దేనికి ప్రచార మధికము? దేనికి విరళము? దేనికి శ్రావ్యత యెట్టిది ? అని యీ తీరు వివేచన మాతని చూపులో నధికముగా నున్నటులు గోచరించును ......" కాఁబట్టి చిన్నయసూరి "తన

మొదటి వ్యాకరణము లందలి విషయములు పెక్కిటిని విడిచి పుచ్చియుఁ, గొన్నిటినీ మార్చుకొనియు, సార్వత్రికములయి సకల సమ్మతములగు లక్షణములు మాత్రము గ్రైకొని, సంగ్రహ రూపమున బాలవ్యాకరణము రచించినాఁడు. ఇది మన యూహకాదు. ఈ యం॰ ములన్నిటిని 'మును మదుపజ్ఞం బగుచున్' ఇత్యాది గ్రంథాంత పద్యములందు నాతడే స్పష్టముగా సూచించియున్నాఁడు ." అని యంగీకరింపక తప్పదు. సూరి బాలవ్యాకరణ ప్రారంభమునందే యిట్లు చెప్పెను

గీ దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు ల
క్షణము గానఁ బూర్వకవుల లక్ష్య
ములను, లాతి లక్ష్మములఁ గాంచి తక్కు ల
క్షణ మెఱింగికొనుఁడు 'చతురమతులు'.

బాలవ్యాకరణాంతమునం దాయన యిట్లు సూచించెను.

కం. మును మదుపజ్ఞం బగుచున్
దనరిన వ్యాకృతిని సూత్రతతి యొకకొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధమగుభంగిఁ దగన్

కం. తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్కనందినవారల్
తనరఁగ నీవ్యాకరణం
బున మూలంబయిన కృతిని బోలఁగినఁదగున్

సత్యమిదికాఁగా " .. భారతచింతామణి విరుద్ధములు కావని తనకుఁ దోఁచునపుడు మాత్రమే యితరమహాకవుల ప్రయోగములను, నథర్వణాదీతరవైయాకరణ వచనములను సూరి ప్రమాణీకరించు చుండును.. ..." అనియు, "... పయిరీతుల నరయఁగా సూరి చింతామణి భారతప్రయోగములనే ప్రాయికముగా మూలముఁజేసి కొని బాలవ్యాకరణమును రచింపనెంచెనని తోఁచుచున్నది కాని ప్రథమప్రయత్నమగుటచేతను, నోపికయుఁ గాలమును జాలకుండుట చేతను, నేదోయొకరీతి నప్పటికిఁ బ్రామాణి కాంధ్రభాషా సామాన్య స్వరూపము దిక్ప్రదర్శితముగనైనఁజూపినం జాలునని తనకుఁ దోఁచుట చేతఁగావలయు భారత ప్రయోగములలోని లక్షణవిశేషములే యనేకములు సూరిచే బాలవ్యాకరణమున సంగ్రహింపఁబడఁజాలవయ్యెను... ..." అనియు ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వకర్త వ్రాయుటకుఁ గారణ ములు వెదక వలయును.

"సూరిగారికి శిష్యులయి పెద్దలయిన వారును, పెద్దలయి శిష్యులయినవారును పెక్కుమంది కలరు. వారిలో సీతారామాచార్యుల వారు ప్రముఖులు, ప్రసిద్ధులు." బహుజనపల్లి సీతారామాచార్యులు గారు రచించిన ముఖ్యగ్రంథములు శబ్దరత్నాకరము, త్రిలింగలక్షణ శేషము. మొదటిది నిఘంటువు. రెండవది వ్యాకరణము. రెండును క్రీ. శ 1885 లో ముద్రితము లయినవి. చిన్నయసూరి నిర్యాణము చెంది యప్పటి కిరువదిమూఁడేండ్లు.

చిన్నయసూరికి శిష్యుఁడనని సీతారామాచార్యులుగారు చెప్పు కొనలేదు. కాని గురువుగారి యుపజ్ఞ వారికిఁ దెలియును. తెలియు ననుటకు వారి మాటలే తార్కాణము. క్రీ.శ 1865 సంవత్సరము డిసెంబరునెల సుజనరంజనీ పత్రికలో కె సుబ్బరాయలు, వి. కృష్ణ మాచార్యులు అనువారిని గలుపుకొని సీతారామాచార్యులుగా రీవిధముగా వ్రాసిరి.

"......దీనిని (నీతిచంద్రిక) రచించిన పరవస్తు చిన్నయ సూరిగారి కాంధ్రమునందును, తదుపయుక్త సంస్కృత ప్రాకృతముల యందుఁ దలస్పర్శియగు పరిజ్ఞానము కలదని వారు చేసిన లక్ష్య లక్షణగ్రంథములే నిరూపించుచున్నవి. మేము వారితోడఁ జిరకాలము సావాసముచేసి యాంధ్రమునందలి యనేకవిషయంబుల నెఱింగిన వారము గనుక వారి పాండిత్యము మా కనుభవసిద్ధము......"

మఱియు క్రీ. శ. 1885 లో అచ్చున కెక్కిన శబ్దరత్నా కరము పీఠికయందు వారే యిట్లు వ్రాసిరి

"... ... కావున న లోపంబుం బాపఁ గొంతకాలంబునకు

ముందు సంస్కృతాంధ్రంబులయందు విశేషపాండిత్యంబు కలిగి యాసేతుహిమాచలము చాలఁ బ్రసిద్ధివహించియుండిన పరవస్తు చిన్నయసూరిగారు జీవితులైయుండిన కాలంబున దీర్ఘసూత్రతతో ననేకగ్రంథపరిశోధనంబు గావించి మిగుల విరివిగాఁ బ్రయోగ సహితంబుగ అకారాది తెనుఁగు నిఘంటు వొకటి వ్రాయం బ్రారంభించి నడపు చుండిరి ... ..."

ఈ విధముగా వ్రాసిన బహుజనపల్లి సీతారామాచార్యులుగారు రచించిన త్రిలింగలక్షణ శేషమునకు, శబ్దరత్నాకరమునకు చిన్నయ సూరి రచించిన బాలవ్యాకరణమునకు ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యాలయమునుండి పశ్యతోహరుల చేతిలోఁ బడిన నిఘంటువునకుఁగల బాంధవ్య మెట్టిది ? చిన్నయసూరి జీవిత చరిత్రమునఁ గొన్ని విషయములు ఎవ్వరును మఱచిపోదగనివి యున్నవి. సూరి పరమపదించిన తరువాత ఆయన కోడలగు పరవస్తు అలమేలమ్మగారి కడకు వెళ్లి, సూరి రచించిన నిఘంటువును ఎవరిచేతనైనఁ బ్రకాశింప జేయింతునని చెప్పి, దానిని సీతారామాచార్యులుగారు తీసికొని కొంతకాలము తమ యొద్ద నుంచుకొనిరి. పిదప ప్రకాశకు లెవ్వరు లభింపలేదని వారు తిరిగి దానిని అలమేలమ్మగారి కిచ్చిరి. కాని ఆచార్యులుగారు సూరి నిఘంటువునుండి ఆవశ్యకములగు విషయములను గ్రహించి, తాము సేకరించిన విషయములతో జోడించి శబ్దరత్నాకరమును ప్రకటించిరి. అంతేకాక చిన్నయసూరి ఆంధ్రశబ్దానుశాసన శబ్దలక్షణ సంగ్రహ సూత్రాంధ్రవ్యాకరణములలోఁ జెప్పి, బాలవ్యాకరణమునఁ జెప్పక విడిచిన లక్షణము లనేకములు త్రిలింగలక్షణ శేషమునందుఁ జేర్చిరి. కావుననే "భక్తిప్రపత్తులతో గురుస్వామికి కైంకర్యమొనరించి, గ్రంథకర్తగా వన్నెకెక్కుటకు చాలినంత విషయసామగ్రి పదిలముగా సంగ్రహించుకొని శబ్దరత్నాకర సంధాత లయి, సూత్రాంధ్ర వ్యాకరణ శబ్దశాసనములందు సూరి నిక్షేపించి యుంచిన లక్షణ విషయములను పెక్కింటిని ప్రౌఢ వ్యాకరణ ద్వారమున వెలుఁగునకుఁదెచ్చి, గురుభక్తి నెఱపిన బహుజనపల్లివారు చిన్నయసూరి శిష్యులలో ప్రముఖులు" అను సత్యకథనము సంభవించినది.

సూరి సేకరించిన లక్షణ విషయము లేవేవి యెట్లు త్రిలింగ లక్షణ శేషమున కెక్కినవో యింతకుముందే సత్యపరాయణులగు పండిత ప్రవరులు రుజువు చేసిరి. ఇవిగాక సూరికిఁ దెలిసిన మఱికొన్ని లక్షణ విషయములును త్రిలింగ లక్షణ శేషమున నున్నవి. సూరి రచించిన నిఘంటువునందలి కొన్నివివరణ వాక్యములను, బాలవ్యాకరణమునందలి సూత్రరచనా పద్ధతిని, సూత్రోదాహరణములను, ప్రయోగములను సూక్ష్మముగాఁ బరిశీలించినచో సీతారామాచార్యులుగారు గురువుల కెట్లు ఋణపడిరో స్ఫటిక స్పష్టముగాఁ దెలియును ఆ విశేషములను దెలియఁజేయుటయే నా సంకల్పము సూరి రచించిన నిఘంటువును నేను జూడలేదు కాని దానిని గూర్చి చిలుకూరి పాపయశాస్త్రిగారు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక నలువదవ సంపుటమున నాల్వ ఆఱవ సంచికలయందు వ్రాసిరి. పాపయ్యశాస్త్రిగారు సూరి నిఘంటువు నుండి యుద్ధరించిన విషయములు నా నిర్ణయములకు దోహదము చేసినవి పరిచ్ఛేదక్రమము ననుసరించి సీతారామాచార్యులుగారి సూత్రములు చూపి, ఆ లక్షణములు చిన్నయసూరికిఁ దెలియునని రుజువు చేయుదును. ఈ వ్యాసమునందలి మంచి సెబ్బరలకు సహృదయులయిన విజ్ఞులే ప్రమాణము.

1 తద్భవములందు నలఘురేఫము కలదు.

(త్రిలింగ శేష, సంజ్ఞా, సూ. 9)

తద్భవములందుఁ గూడ శకటరేఫము కలదు. సీతారామాచార్యులుగారు కఱకంఠుఁడు, కాఱియ మున్నగు వానిని సూత్రోదాహరణములుగా నిచ్చిరి. అంతేకాక శబ్దరత్నాకరములో "పెఱ" అను శబ్దముకడ ఆచార్యులుగారు "ఇట్లు పెఱ, చెఱ ఇత్యాద్యనేక శబ్దములయందు శకటరేఫము కనబడుచుండఁగా చిన్నయసూరిగారు 'శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు' అని చెప్పుటకు అభిప్రాయమేమో తెలిసినదికాదు" అని వ్రాసిరి.

అహోబల పండితుఁడు తద్భవములలో అలఘురేఫము కలదనెను. పాఱు శబ్దము తద్భవ మనినయెడల శకటరేఫము దాని యందుండుట దోషముగాదని యనుకొనవలెననియు, ఉక్కెఱ, కఱకు మొదలగు తద్భవములలో శకట రేఫముండుట దానికి హేతువనియు, కావుననే యథర్వణాచార్యులు లక్ష్యములనుబట్టి రేఫోచ్చారణము కల్ప్య

మని వచించెననియు ఆ యభినవ నన్నయభట్టాచార్యుఁడు వక్కాణించెను

నను 'పాఱు' శబ్దస్య యది తద్భవత్వం తర్హి గురురేఫః కథమితిచే న్నైష దోషః. 'ఉక్కెఱ' 'కఱకు' 'మొఱకు' ఇత్యాది తద్భవేష్వపి తచ్ఛ్రవణాత్ అతఏవ ఆథర్వణః లక్ష్యానురోధేన ఉచ్చారణస్య కల్ప్యత్వమాహ.

(కవిశిరోభూషణము. అజన్త పరిచ్ఛేదము. 139 పు 6)

సూరి బాలవ్యాకరణమున సంజ్ఞాపరిచ్ఛేదములో పదునెన్మిదవ సూత్రమునకు దిగువ "శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు" అని వ్రాసెను. కాని నిఘంటువు రచించునాఁటికి ఆయన తద్భవములలో అలఘురేఫము కనబడుచున్నదని యంగీకరించినవాఁడయ్యెను ఆయన తన నిఘంటువులో 'కాఱియ' శబ్దముకడ నిట్లు వ్రాసెను.

కాఱియ – యాతన, ప్రాక్కారి ఆ
క్వాపి తద్భవేష్వలఘురేఫో దృశ్యతే
2 కోట పేటలు వైకృతములు.
"కోట శబ భవము కోట. పింరా శబ్దభవముఁపేట. కోట్ట శబ్దపర్యాయంబుగా సంస్కృతంబునఁ గోటశబ్దమొక్కండు గానంబడియెడి. దానివలనఁ గలిగిన దందురేని యపుడది కుండ లోనగువాని వంటిదని యెఱుంగవలయును......"

(త్రిలింగ. శేష, సంజ్ఞా సూత్ర)

చిన్నయసూరి "త్రిలింగదేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు" అని వ్రాసి యా సూత్రముక్రింద కోటపేటల నుదాహరించెను. బాల వ్యాకరణములో ఈ శబ్దమును దేశ్యముగా సంభావించిన సూరి తన నిఘంటువులో వైకృతమని నిర్ణయించెను. దాని యం దిట్లున్నది.

కోట :– ప్రాకారదుర్గము, సాలము నగరప్రాకారము.
సం. కోటః

"కోట్ట దురే పునస్పమే" ఇతి హేమచన్ద్రః
కావున నిఘంటు రచన నాఁటికి సూరి 'కోట'ను 'కోట్ట' శబ్దభవముగానే గ్రహించెననుట నిర్వివాదాంశము.

ఇఁక పేట విషయము. సూరి యుదాహరించిన 'పేట' లో అరసున్న లేదు. అరసున్నతోఁ గూడిన రూపమును సూరి యుదాహరిపలేదని వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారును విశ్వసించి "పల్లె అనునర్థముగల సార్ధబిందుకపేట శబ్దమును సూరి యుదాహరింపలేదు. బాలవ్యాకరణముద్రణములలో నెందును సార్ధబిందుకపేట శబ్దము పడియుండలేదు. పేట–దే. వి. హారములో నొక సరము (శ ర.) అను నిర్బిందుక పేట శబ్దమె సూరిచే నుదాహృతమయ్యె ననుటలో సందియములేదు" అని వ్రాసిరి. బహుజనపల్లివారీ సబిందుక నిర్బిందుక భేదము నేలగుర్తింపరో తెలియదాయె.

3. ఉదంతములగు నమహత్తుల కందువర్ణకము పరంబగు నపుడును నగాగమంబు కొన్నియెడలఁ గానంబడియెడి.

(త్రిలింగ శేష, శబ్దపరి, సూత్ర 21)

ఉత్తు తుదినిగల యమహద్వాచకములకు 'అందు' అనుసప్తమీ విభక్తి ప్రత్యయము పరమగునపుడును గొన్నిచోట్ల నగాగమము కనఁబడునని సూత్రతాత్పర్యము ఇట ఆచార్యులుగారు "అనిమిష నాయకత్వమునయందు" "నిండుజవ్వనంబునయందు" "మనంబున యందు" మున్నగు లక్ష్యములుచూపిరి నాయకత్వము + న + అందు = నాయకత్వము + న + అందు = నాయకత్వమునయందు. ఇట్లే యితర లక్ష్యములు ప్రాప్తించును.

చిన్నయసూరియు నిట్టిప్రయోగములను జూచెననియే చెప్పవలయును చూడనిచో "సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు" (బాల, సంధి, సూత్ర 24) అనురీతిని సూత్ర నిర్మాణ మెటు చేయుగలడు? "సమాసము" అనునది యుదంతసుఖున యమహద్వాచకముగదా! దానికి 'అందు' వర్ణకము పరమయినపుడు నగాగమము ప్రాప్తింపనిచో "సమాసంబునయందు" అను రూపమెట్లేర్పడును?

4 వలన కాదేశం బగు ద్వితీయా సప్తములమీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు.

( త్రిలింగ శేష, కార, సూ త్‌)...

ఈ సూత్రార్థము తెలియుటకు బాలవ్యాకరణము ౨ రక

పరిచ్ఛేదము నందలి తొమ్మిదవ పదవ పదునొకండవ సూత్రములను జూడవలయును. "అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలన వర్ణకంబగు (బాల. కార. సూత్ర 9) "అళుల్ వెడలెన్ గొలంకులన్" (స్వారోచిష మను సంభవము. ఆశ్వా 3. పద్య 60) అని కవి ప్రయోగము తుమ్మెదలకుఁ గొలంకులనుండి అపాయము అనఁగా ఎడఁబాటు కలిగినది కాఁబట్టి 'కొలంకులు' అను దానికి వలన వర్ణకము వచ్చి "కొలంకుల వలన" అని యగును. "ఉండిప్రదం బొకానొకచో వలన వర్ణకంబున కను ప్రయుక్తంబగు" (బాల. కార సూత్ర 10) అను సూత్రముచే "కొలంకులవలన+ ఉండి" అని యగును. "ఉండి శబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగనగు" (బాల. కార సూత్ర 11) అను సూత్రముచే వలనకు ద్వితీయ ప్రాప్తించి "కొలంకులవలన+ ఉండి =కొలంకుల+ను+ఉండి" అని యగును

తరువాత ఆచార్యులుగారు చెప్పిన పయిసూత్రముచే వలన కాదేశముగా వచ్చి ద్వితీయమీఁదనున్న ఉండికి లోపము కలిగి "కొలంకులను + ఉండి" = కొలంకులను" అని యగును ఇటు ఆచార్యులుగారు "దితి గర్భముఁ జెచ్చెర వెలువడు" "రక్తంబు వదన గహ్వరమున వఱదవాఱ" మున్నగు లక్ష్యములను జూపిరి

కాఁగా చిన్నయసూరి తన నిఘంటువులో జైమిని భారతము నందలి

కం కౌరవ సభలో లజ్జా
వారిధిఁ దగ నుద్ధరింపవా ద్రౌపది; న
న్నారీతి నుద్ధరింపుము
నీరజదళనేత్ర! కలుషనీరధివలనన్.

అను పద్యము నుదాహరించి "వారిధి నితి పంచమ్యా ద్వితీయా" అని యనుటచే ఆచార్యులుగారు చెప్పిన లక్షణము సూరికిఁ దెలియునని యనుకొనక తప్పదు "వారిధి వారిధి వలన = వారిదివలన + ఉండి = వారిధి+ ను + ఉండి = వారిదిని" అని గుణనగా! సహృదయులాలో చింతురుగాక!

ఈ పద్యమును గూర్చి యొకమాట చెప్పవలయును సూరి లజ్జావారిధిఁ దగ నుద్ధరింపవా" యను పాఠమును జూపెనుగదా! కాస్త్రి వావిళ్ళవారు 1953 స॥ లో ముద్రించిన జైమిని భారతములో "లజ్జావారిధి దిగ నుద్ధరింపవా" యని యున్నది ఈపాఠము ప్రకరణౌచితము గాదు

5 ధాతుజ విశేషణ భావార్థక పూర్వ వ్యవహితా వ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠి యగు
(త్రిలింగ. శేష, కార, సూత్ర 15)

ధాతుజ విశేషణములకు, భావార్థకములకు వెనుకనుండి కర ను జెప్పు పదమునకుఁ బ్రథమావిభక్తికి మాఱుగా షష్ఠీవిభక్తి ప్రత్యయమగు 'యొక్క" తఱచుగా నగును కర్తను జెప్పు పదము ధాతుజ విశేషణములకు, భావార్థకములకు వెన్నుదన్నియున్నను, ఎడముగా నున్నను ఈ సూత్రము ప్రవర్తించును.

ధాతుజ విశేషణములకు వెన్నుదన్నియున్న కర్తృపదప్రథమకు యొక్క షష్ఠి యగుటకు "నా చూడని రాజులు" మున్నగు లక్ష్యము అను ఆచార్యులుగారు చూపిరి. "నేను జూడని రాజులు" అనునది సాధారణ లక్ష్యము ఇందు "చూడని' యనునది ధాతుజ విశేషణము దాని వెనుకనే యున్న "నేను" కర్తృ సూత్ర ప్రకారముగా కర్తయగు 'నేను' అనుదానికి యొక్క షష్ఠి చేరి "నా యొక్క"అని యగును. అపుడు "నా యొక్క చూడని రాజులు" అను రూపము ప్రాప్తించి "యొక్కకు లోపంబు బహుళంబు" అను సూత్రముచే "నా చూడని రాజులు" అని యగును

ఈ పలుకుబడి చిన్నయసూరికి క్రొత్తగా దనుటకు ఈక్రింది బాల వ్యాకరణ సూత్రోదాహరణములే తార్కాణము సూరి "లూణ్మధ్యమ వు రు. లకు ముడుబ్బులగు" (బాల క్రియా. సూత్ర 29) అను సూత్రమును వ్రాసి విధ్యర్థమునకు లక్ష్యములుగా "నా చెప్పిన పని చేయుము" "నా చెప్పిన పని చేయుఁడు" అను వానిని జూపెను. ఆ లక్ష్యములలో 'చెప్పిన' యనునది ధాతుజ విశేషణము. "నేను జెప్పిన పని" యనునది సాధారణ లక్ష్యము. "నేను"

అను కర్త "చేసిన" యను ధాతుజ విశేషణము వెనుకనే యున్నది. ఆ కర్తకు యొక్క షష్ఠి చేరినచో "నా యొక్క చెప్పిన పని" యను రూప మేర్పడి యొక్క లోపించి "నా చెప్పిన పని" యగును

6 యొక్కకు లోపంబు బహుళంబు.

(త్రిలింగ శేష, కార, సూత్ర 16)

షష్ఠీ విభక్తి ప్రత్యయ మగు యొక్క బహుళముగా లోపించును. సమాసంబున 'యొక్క' లోపించుట ఎంతగాదు బాల వ్యాకరణమే "సమాస విభక్తికి లోపంబగు, లట్టునకుఁ గాదు" (సమాస. సూత్ర 25) అని శాసించుచున్నది సమాసము గానప్పుడును యొక్క బహుళముగా లోపించు నని ఆచార్యులుగారు చెప్పిరి "వారివ ధమ్మిల్ల భారానకలిత దివ్యామోద నవపుష్పదామములయు" అను లక్ష్యమును జూపిరి "దామముల యొక్క + యును" అనునది ఆదిమ లక్ష్యము. 'ను' శబ్దము అవ్యయము. "నామ సర్వనామంబులకును గళలగు నవ్యయంబులకును గడపల సముచ్చయార్థ విశేష పాధ పూరణంబులయందు 'ను' శబ్దంబు తఱచుగ నగు కళలగు ననుదంత శబ్దముల మీద నయ్యది యువర్ణపూర్వకంబు విభాష నగు మఱియు నది శేషషష్ఠియందు యొక్క లోపించినపుడు లాగమాంత బహువచనంబు మీఁదను సముచ్చయమునం జూపఁబడె" (శబ్ద పరిచ్ఛేదము సూత్ర116)అని ఆచార్యులుగారు చెప్పిరి. "దామముల యొక్క + యును" అని యున్నప్పుడది సమాసము గాదు యువర్ణ పూర్వకమయిన 'ను' అను అవ్యయము పరమగుటచే నిది; సమాసము గాదని గ్రహింపవలయును అయినప్పటికి 'యొక్క' లోపించుటచే "దామములయును" అని యగును.

బాలవ్యాకరణమునందలి స్త్రీ సమంబులగు విశేషణంబులయు, ముువర్ణకాంత విశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు" (కార. సూత్ర 20) అను సూత్రమును జూచినచో త్రిలింగ లక్షణశేషకర్త చెప్పినలక్షణము సూరికిని దెలియునని తేటతెల్లమగును "విశేషణంబులయు" "ముువర్ణకాంత విశేషణంబులయు" అను పదములను జూడుఁడు "విశేషణంబులయొక్క + యును" "ముువర్ణకాంత విశేషణంబుల యొక్క + యును" అని యున్నపుడు అవి సమాసములు గావు కాకపోయినను 'యొక్క' లోపించినది త్రిలింగ లక్షణ శేషకర్త చెప్పినదిదే కదా!

7. షష్ఠీ తత్పురుషంబులందు నగాగమంబు విభాషనగు

(త్రిలింగ. శేష, సమాస, సూత్ర 1

షష్ఠీ తత్పురుష సమాసములలో నగాగమము వైకల్పికముగా నగు నని సూత్రార్థము. ఆచార్యులుగారు "ఎలజవ్వనంబున విలసనంబు మున్నగు లక్ష్యములను జూపిరి ఎలజవ్వనంబు యొక్క + విలసనంబు. ఇది సమాసము గావున విభక్తియగు 'యొక్క లోపించి "ఎలజవ్వనంబు + విలసనంబు" అని మిగులును తరువాత షష్ఠ్యంత మగు "ఎలజవ్వనంబు" నకు నగాగమమైన "ఎలజవ్వనంబు + విలసనంబు = ఎలజవ్వనంబు + న + విలసనంబు ఎలజవ్వనంబున విలసనంబు" అని యగును. నగాగమము వైకల్పికము గావున "ఎలజవ్వనంబు విలసనంబు" అనియు నగును.

చిన్నయసూరియే యిట్టి ప్రయోగమును జేసెను. "తెనుఁగు నకు శబ్దలక్షణము" అను పద్యమును జూడుఁడు ఆ పద్యమున "ఈ వ్యాకరణంబునమూలంబు" అను ప్రయోగమున్నది. అది షష్ఠీతత్పురుష సమాసము. "ఈ వ్యాకరణంబుయొక్క మూలంబు" అని యుండఁగా యొక్క లోపించి షష్ఠ్యంత పదమునకు నగాగమమయి "ఈ వ్యాకరణంబునమూలంబు" అను రూప మేర్పడినది.

సీతారామాచార్యులుగారు "అనేక కర్తృక క్రియకు సమీప కర్త యొక్క లింగవచనంబులగు" (వాక్య సూత్ర 15) అని యొక లక్షణము చెప్పిరి. అనేక కర్తృక క్రియ యనఁగా పెక్కు కర్తలు గల ఏక క్రియ ఒక వాక్యమున మహద్వాచకములు, అమహద్వాచకములు అయిన కర్తృపదములు పెక్కు లుండి, యొక క్రియలోని కన్వ యించినచో ఆ క్రియ అనేక కర్తృకక్రియ యగునని సూత్రకారుని తలంపు దాని సమీపమున నే కర్తృపద ముండునో యా పదము ననుసరించి ఆ క్రియకు లింగవచనము లేర్పడునని సూత్రార్థము.

ఈ సూత్రములో "లింగవచనంబులగు" అని యున్నది. ఇట లింగ మనఁగా నేమి? దానికి మహత్త్వమనియో,అమహత్త్వమనియో, యర్థము చెప్పుకొనవలయును ఏలయన తెలుఁగుశబ్దములకు—అందను క్రియాపదములకు—లింగము లేదు కావుననే సూరి "ఆచ్ఛిక శబ్దంబు లెల్లం దఱచుగ స్త్రీ సమంబులుం గ్లీబసమంబులు నయియుండు" (ఆచ్చి సూత్ర 2) అని నామ విభక్త్యంతములయిన తెలుఁగు మాటలకు లింగము నతిదేశించెను ఆ విధముగా క్రియాపదములకు లింగము అతిదేశింపఁబడలేదు ఈ హేతువుచే ఆచార్యులుగారు వాడిన లింగశబ్దమునకు మహత్త్వమనియో, అమహత్త్వమనియో యర్థము చెప్పుకొనవలయును పెక్కు కర్తలున్నప్పుడు క్రియాపదమునకు సమీపముగా నున్న కర్తృపదము ననుసరించి మహత్త్వమో యమహ

త్త్వమో ఏకత్వమో బహుత్వమో యగునని సూ॥తార ము.

'ఏ వాని బంధుమిత్రులు జీవధనంబులు డప్పఁజెందును......'
అని ఆచార్యులుగారు చూపిన లక్ష్యము. ఇట చెందును అను క్రియా పదమునకు మహద్బహువచన మగు బంధుమిత్రులు, అమహద్బహు వచన మగు జీవధనంబులు రెండును గర్తలే. కాని దానికి అమహద్బహు వచనమగు జీవధనంబులు సమీపమున నున్నది. కాఁబట్టి చెందు ధాతువునకు అమహత్త్వము బహువచనము ప్రాప్తించినవి. అయిన ధాతువు ఏకవచనాంత మయినదేమి? యను ప్రశ్న కలుగును. "తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిడ్లోటుల ప్రథమ బహు వచనంబున కేకవచనంబగు" (క్రియా. సూత్ర 25) అను బాల వ్యాకరణ సూత్ర మున్నదికదా! కనుకనే అమహత్త్వము ప్రాపించిన 'చెందు' ధాతువునకు బహువచనము మాఱుగా ఏకవచనము ప్రాప్తించినది. బంధుమిత్రులు అను మహద్బహువచనమునుబట్టి క్రియా పదము రూపొందినచో "చెందిరి" యను మహద్బహువచనరూపమే యుండెడిది. కాని సమీపమున "జీవధనంబులు" అను అమహద్బహు వచన ముండుటచే "చెందును" అను క్రియాపద మేర్పడినది.

తిక్కన గావించిన "భూవరుడు సుహృజ్జనంబుఁ బరి వారముఁ జిత్తములందు మెత్తురే" (విరాట ఆశ్వా 4. పద్య 11) అను ప్రయోగము ఆచార్యులుగారు చెప్పిన లక్షణమునకు విరుద్ధముగా నున్నది. చదలువాడ సుందరరామశాస్త్రిగారు దండిగుంట సూర్య నారాయణ శాస్త్రిగారు రచించిన భారత సంజీవని యను వ్యాఖ్యతోఁ గూడిన విరాట పర్వమునందు, ఉస్మానియా విశ్వవిద్యాలయమువారి సంశోధిత భారతమునందును, ఆంధ్ర సాహిత్య- ఎకాడమీవారి భార తము నందును తిక్కన ప్రయోగము పై విధముగనే యున్నది.

ఆ పద్యపాదమున భూవరుఁడు అను మహద్వాచకము సుహృ జ్జనంబు పరివారము అను అమహద్వాచకములు కర్తలు. "మెత్తురే' యనునది క్రియాపదము మూఁడుకర్తలుండుటచే అది అనే కర్తృకక్రియ యగును. దానికి పరివారము అను అమహదేకవచనము సమీపమున నున్నది ఆచార్యులుగారు చెప్పిన లక్షణము ప్రకారముగ ఆ క్రియాపదమునకు అమహత్త్వము, ఏకవచనము ప్రాప్తిం "మెచ్చునే" యను రూపము రావలయును. కాని మెత్తురే యను రూపమే యిట నున్నది

దీనినిబట్టి "అనేక కర్తృకక్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబులగు" అని ఆచార్యులుగారు చెప్పిన లక్షణము నిత్యవిధి గ దనియు; దానిలో మార్పులు పలయుననియుఁ దోఁచుచున్నది.

## ఉపయుక్త గ్రంథములు

1 సూత్రాంధ్ర వ్యాకరణములు—
ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితము.
2 ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వము.
3 రమణీయము—ద్వితీయముద్రణము.
4 ప్రౌఢవ్యాకరణము—తత్త్వబోధినీ వ్యాఖ్యాసమేతము.
5 ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక—
నలువదియవ సంపుటము.



# అబ్ధీ

శ్రీ సోమసుందర్

అసలే వృద్ధుడా అబ్ధి
పైగా ఉబ్బసం కూడానా
అయినా మానడు అపథ్యం
జిహ్వాచాపల్యానికి బొత్తిగా దాసుడు !
అందుకే అస్తమానం కక్కుతాడు కఫం
ఒగర్పుతో బాధపడుతూనే ఉంటాడు
విడతెరిపిలేని ఆయాసం
కాని వాడికి చావురాదు చిత్రం
వైద్యుడూ నారాయణుడూ మాత్రం
హరించుకు పోయారెప్పుడో !
సెలయేళ్ళూ యేళ్ళూ నదులూ మహానదులూ
లక్షలాది కృశాంగినులూ సింహేంద్ర మధ్యలూ
అన్నీ వాడికి సాకీలూ చషకాలూ,
అనునిత్య మధుసేవనంలో
సాక్షాత్తూ సమవర్తికీడు;
అనవరత వర్తమానతలో
ఒమార్ ఖయ్యాముకి సైదోడు
ఇంత సనాతనుడా మళ్ళీ
కొడుకుల కొడుకులూ కూతుళ్ళకి పెళ్ళిళ్ళూ
ఎప్పుడూ తలపెట్టడు; ఎవరికి వారు
'స్వయంవరమే' అనడంలో వాడాధునికుడు !
“అబ్ధీ...అబ్ధీ...!
ఇంతనీ `దీర్ఘాయుర్దాయానికి
అసలు రహస్యం చెప్పు:
కామితార్థసిద్ధా ? అహరహ సంగమలబ్ధా ?
కూలంకష మద్యాచార ప్రసిద్ధా ?

---

# వేముగల్లు

## శ్రీ గుండి లింబాద్రి

రాజా మల్లన కీర్తిచంద్రికలు సర్వంబొంగి మధ్యాశ్రిత
క్షోణీభృద్వన దుర మై గుణమణి స్తోమంబు లన్నింటియ
క్షీణ శ్రీ పురుషోత్తమాశ్రయము నై చెల్వారి దానామృత
శ్రేణిం ద్యాగ సముద్ర నామము వహించె న్వేముగల్లీమహిన్.
సిం. ద్వా. 1–56

అని సింహాసన ద్వాత్రింశిక కర్తయగు కొఱవి గోపరాజుచే కీర్తించ



లింబాద్రి గుట్టపై వెలసిన నారసింహస్వామి విగ్రహం
"ఏకేన చక్ర... ..." అను దానికి చక్కని అనుకృతి.

బడిన, హరిహరుల చరణ ధూళిచే రాగరంజితమై పుణ్యక్షేత్రంగా భక్తులచే కొనియాడబడుచున్న "బెంగల్" నిజామాబాద్ జిల్లా ఆర్మూర్ తాలూకా కేంద్రమునకు తూర్పు దిక్కున 18 – 20 మైళ్ళ దూరములో విరాజిల్లుచున్నది. జిల్లా కేంద్రమైన నిజామాబాద్‌నుండి ఆర్. టి. సి. బస్సు సౌకర్యము కలదు. ఇచ్చటికి నిజామాబాద్, కరీంనగరము, ఆదిలాబాద్ ప్రాంతమువారే గాక బొంబాయి, నాగపూర్ మొదలగు దూర ప్రాంతములనుండి కూడ యాత్రికులు వస్తూవుంటారు. "బాలాఘాట్" పర్వత శాఖలలో కల ఒక చిన్న శాఖలో విరాజిల్లుతూ ప్రకృతి ఎంతో సుందరముగా నుండును.

చరిత్ర : ప్రస్తుతము 'బేంగల్' అని పిలువబడుతూవున్న దీనిని "వేముగల్లు" అనీ "వేంగల్‌కస్బా" అని మొన్న మొన్నటి వరకు పిలిచేవారు. 'వేముగల్లు'ను ఉర్దూలో 'బేంగల్' అని అనే వారు. ఇప్పుడు 'భీంగల్' అని వ్యవహారములో వుంది. కాని చారిత్రకంగా చూస్తే వేముగల్లు, – వేములకొండ – 'వేపకల్లనగరి' అను పేర్లు కనబడుతూ వున్నాయి. 'వేముగల్లు' అను దానికి సంస్కృతీకరణమే నింబాద్రి నింబ + అద్రి = వేప + కల్లు = ఇకపోతే ప్రస్తుతము వేముగల్ – నింబాద్రిగుట్ట ఈ రెండు వేరువేరుగా వ్యవహరించబడుతున్నాయి. గ్రామానికీ గుట్టకూ 2 మైళ్ళదూరం వుంది. గుట్టపై శ్రీ లక్ష్మీనారసింహస్వామి దేవర వేంచేసి యుండగా గ్రామమైన వేముగల్‌లో పరమ వైష్ణవుడైన శివుడు వెలసియున్నాడు. ఒకానొకప్పుడు 'వేముగల్లు' చాల పెద్ద పట్టణమై నేటి నింబాద్రిగుట్ట గ్రామము కలసియుండెడివని చెప్ప వచ్చు. హరిహరులు వెలసిన క్షేత్రము కావుననే కొఱవి గోపరాజు.

"ఉరగనికరవేషీ యోగ నిద్రాభిలాషీ
గిరిధర వరదాయీ క్షీరవారాశిశాయీ
పుర విదళన దక్షా పుండరీకాయతాక్షా
స్మరహరహరిరూపా సత్యనిత్య స్వరూపా"

అని యిద్దరినీ ఒకేఒక రూపంలో చూడగల్గినాడు. ఇచ్చట

...ఆలయపు శిథిలాలలో త్రిభువన మల్ల చాళుక్య ప్రభువు కాలమునాటి శిథిల శాసనము కలదు. శాతవాహనపరముగా చూచినచో బోధన్ – వేములవాడల మధ్యనున్న యీ క్షేత్రం చాళుక్యుల కాలంలో అతి వైభవమును అనుభవించినది. రాణామల్లన్నకు రాజధానియైన పల్లి కొండ, ఇనుప కత్తులకు లండన్‌లో కీర్తి నార్జించిన కోనసముద్రము, సిరికొండ, మానువాలు (మానాల్) జైన క్షేత్రమైన పెద్దంగటి (పెద వేముగంటి) ...ంటి, కుఆసామానులు, ప్రేలు మొదలగు వాటికి ఆంగ్లేయుల మన్ననల నందుకొన్న "పాతపాట" మొదలగు నవి 5 మైళ్ళ పరిధిలోనే కలవు. ఇత్తడి పనితనానికి 'వేముగల్'కు చాల మంచిపేరుంది. ప్రస్తుతము 2, 3 గృహాలుమాత్రం మిగిలినవి. చాలమంది నిర్మల్ మొ॥ పట్టణాలలో వుంటున్నారు.

బ్రహ్మవైవర్త పురాణాంతర్గతమైన 10 అధ్యాయములు కల శ్రీమన్నింబగిరి క్షేత్ర మహాత్మ్యం అను పురాణములో దీని వివరణ కలదు. అది చాల గొప్పగా యీ ప్రాంతములో చలామణిలో వుంది. *(అట్టి దానిని మద్రగజులు బ్రహ్మశ్రీ నంచి శ్రీధరరావుగారు త్వరలో తెలుగు రసికులకు అందించుచున్నారు). నింబాచలముపై వెలసిన నారసింహస్వామిని చూచిన పిదపనే పరివ్రాజకాచార్య జగద్గురువు ఆదిశంకరులు–

ప్రబంధకవి.

ఏకేన చక్ర మపరేణ కరేణ శఙ్ఖ-
మన్యేన సింధుతనయా మవలమ్బ్య తిష్ఠన్
వామేతరేణ వరదాభయ హస్తముద్రాం
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్,

అని స్తుతించినాడని అంటారు.

తెలుగు సాహిత్యంలో ప్రథమవిజ్ఞాన సర్వస్వ మని కీర్తించ బడిన 'సింహాసనద్వాత్రింశిక' ను మనకందించిన గోపరాజుకు జన్మ నిచ్చినదీ పుణ్యభూమి.

...వేముగల్లు జన్మభూమిగా పెరిగియు...శ్రీమద్భగవద్గీతా యోగశాస్త్రమును అందించిన దత్తోజి పండితుడు ఆడుకొన్న చోటిది. 'హరిశ్చంద్ర నాటకం' లో హరిశ్చంద్రుని నింబాచలంపై కెక్కించిన బ్రహ్మశ్రీ చౌడి శ్రీనివాసులుగారు పెరిగిన సత్య క్షేత్రమిది

ఇప్పటికి సంస్కృతపండితులకు నిలయమిది, ఒకప్పుడు శైవ– వైష్ణవులు సమపుజ్యగానున్నా నేడు వైష్ణవక్షేత్రంగానే నిలిచి పోయినది. ప్రతి సంవత్సరం వైశాఖశుక్ల 6 నుండి పూర్ణిమ వరకు పుష్యపూర్ణిమనుండి కృష్ణ 7 వరకు ఉత్సవాలు జరుగుతుంటాయి. 'హోళి' నాడు డోలారోహణ వుంటుంది. కార్తీకశుక్ల 6 నుండి



'వేముగల్లు' శిథిలాల శివాలయపు నంది
దీనికి కొంత దూరంలో కల్యాణి చాళుక్యుల శాసనము
(శిథిలము) కలదు.

కృష్ణ 2 వరకు నింబాద్రి గుట్టపై కల్యాణోత్సవం, రథోత్సవము జరుగుతుంది, వేలాదిమంది వస్తుంటారు.

ధార్మిక, చారిత్రక, సాహిత్య కళారంగాలలో కీర్తినార్జించిన వేముగల్లు 1909 ప్రాంతములో పరగణా కేంద్రముగా నుండినది. పిదప ఆర్మూర్ తాలూకా కేంద్రమైన పిదప నిదిపూర్తిగా మరుగున పడిపోయినది. కాని ఈమధ్యనే పంచాయతిసమితి కేంద్రముగా తిరిగి తన పురాతన శోభను పొందటానికి శ్రీ సుదర్శన్‌రావు సర్‌పంచ్‌గారి ఆధ్వర్యములో అవిరళకృషి చేస్తూవున్నది.

వేదవేదాంత వేద్యాయ దశరూపాది ధారిణే
స్తోతుం త్వాం న సమర్థోస్మి విధేహి కరుణాం మయి.

* (భాషాపరంగా నింబాద్రి అనేదే సరియైనా, వ్యవహారములోనిది లింబాద్రిగానే వుంది)

# పరుగే నా బతుకు

## శ్రీ దేవిప్రియ

ముందు ఎండలో నిలిచినా,

చలికి శరీరం మంచుగడ్డై
చలినెగళ్ళ కోసమో
శరీర దహనం కోసమో కాక,
రెండు గుండెలు సున్నితంగా రాసుకుంటే
రెండు ఆశయాలు ఆలింగనం చేసుకుంటే
పుట్టే నులివెచ్చని వేడికోసం
గ్రీష్మవర్షంలో ఆసాంతం తడిసినా
గోరువెచ్చని నీళ్ళ తోడ్పాటుకోసం
ఈ ముళ్ళు వెదజల్లబడిన దారుల్లో
ఈ ఆవలిగట్టు కనిపించని తీరాల్లో
నెత్తు రోడుస్తున్న అరికాళ్ళతో
వేదనామంత్ర పఠనం చేస్తున్న కళ్ళతో
బతుకు సంగీతాన్ని వెతుక్కుంటూ
ముందు నడిచిన బాటసారులు జారవిడుచుకున్న
జీవితపు విలువల్ని, మానవతా మణిహారాల్ని
యేరుకొంటూ యేరుకొంటూ
హక్కుల వలువల్ని విడిచేసి
బానిసత్వపు బందిఖానాలోకి నగ్నంగా నడిచివెళ్ళిన
వెనుకతరం అడుగుజాడల్ని తప్పించుకొంటూ
నడకే తపస్సుగా
అలుపే పయస్సుగా
క్షణమే వయస్సుగా
ఉదయాల్ని సూర్యుల్ని, సూర్యోదయాల్ని వెతుక్కుంటూ
పరిగెడుతూ పరిగెడుతూ – నేను.

---

# కలగూరగంప

## 'కాకతీయుల చరిత్రకు ఒక అమూల్యశాసనము'

**1974** 'మే' నెల భారతిలో సుప్రసిద్ధ పరిశోధకులు శ్రీ పి వి పరబ్రహ్మశాస్త్రిగారు 'రుద్రమదేవి రణభూమిలో వీరస్వర్గమలంకరించెనా!' అనే శీర్షికతో—నల్లగొండ తా చందుపట్ల గ్రామంలోని కాకతీయుల శాసనాన్ని ఇచ్చి ఆ శాసనానికి చరిత్రలోగల్గు ప్రత్యేకతను నిరూపించిరి. ఇంతకాలంగా అజ్ఞాతదశలోనున్న ఈ శాసనాన్ని పరిశోధనచేసి విషయ వివరణతో తెల్పి-సాహిత్య లోకకృతజ్ఞతా పాత్రులైనారు—శాస్త్రిగారు

ప్రస్తుతశాసనమున్న 'చందుపట్ల' మా స్వగ్రామము (దీనికి సమీపంలోగల 'నకరెకల్లు' చారిత్రక విశేషాలు గలది శ్రీనాథమహాకవి క్రీడాభిరామంలో నల్లంగొండయు నాగరికల్లును ధరణీస్థలం ప్రగల్భస్థలముల్ (121) అన్నాడు ) మా గ్రామంలోని శాసనం ఇంత ప్రాముఖ్యమైనదని తెలిసి ఎంతో సంతోషిస్తున్నాను, అయితే—దీన్ని గూర్చి కొంతతెల్పటం—ఈ సందర్భంలో అవసరం.

శ్రీ శాస్త్రిగారు ఎక్కడా పేర్కొనకపోయినా (తమవ్యాసంలో) 'ఈ గ్రామంవద్ద శాసనం ఉందని' అది ఇప్పటికె అక్షరాలు కానరాని స్థితికి వచ్చిందనీ—ప్రభుత్వంవారు—ముఖ్యంగా భూగర్భ—శాసన పరిశోధకవారు దీన్ని ఫోటోతీయించి-దానిలోని విషయాలు వెల్లడించగలరని కోరుతూ నేను 1966 సెప్టెంబర్ 'భారతి' (లేఖలు పుట 73) ద్వారా తెలియబరచినాను, తర్వాత ఒక లేఖ డైరక్టరుగారికి వ్రాస్తూ దానివెంట కత్తిరించిన ఈ లేఖాభాగాన్ని పంపినాను చాలా కాలంతర్వాత రెండు లైన్ల జవాబు వచ్చింది 'మీ లేఖ చేరింది-విచారిస్తాము' (అంటే ఎంక్వయిరీ) అని తర్వాత పరబ్రహ్మశాస్త్రి గారిని కలిసి చెప్పినాను వారుగూడ 'మంచిది' అన్నారు రెండు మూడుసార్లు మళ్లీ డైరక్టర్‌గారికి ఉత్తరాలు వ్రాస్తిని జవాబులేదు. కాని మా వూరినుంచి ఒక లేఖ ఎప్పుడో వచ్చింది ఇద్దరు వ్యక్తులు వచ్చి మా యింటో నేవుండి మా పెద్దలసాయంతో దాన్ని కాపీ తీసుకపోయినారని తెల్పుకొని సంతోషించినాను ఆఫీసువారికి వ్రాస్తే జవాబు నాస్తి' శాస్త్రిగారుమాత్రం నాతో 'త్వరలో దీని గూర్చి తెల్పులాను. మీకూ ప్రత్యేకంగా తెల్పుతాను' — అన్నారు తర్వాత నాకు కూడా శ్రద్ధాసక్తులు సన్నగిల్లినవి ప్రభుత్వ వ్యవహారంగదా'? త్వరలో' 'అన్నశాస్త్రిగారు—1974 మే నెలలో ఈ శాసనానికి ముకురదీక్ష కలిగించినందుకు వారికి మరియొకమారు కృతజ్ఞతలు ఇందు వారు నన్ను పేర్కొనలేదని బాధపడను కాని దీని వెంటనే ఇదే స్తంభముపైగల 'చాళుక్య విక్రమాదిత్యుని రాజ్యవర్షములకు చెందినవి' అని శాస్త్రిగారు తెల్పిన ఆ శాసనాన్ని గూడా ప్రకటిస్తారేమో అనియు, దానినీ దీనికీ గలిపి ఒకే లేఖ 'భారతి'కి వ్రాతామనియు ఇంతకాలంగా చూచినాను అది రాకపోవటంతో — వారికి కృతజ్ఞతలు తెల్పుతూ దీన్ని వ్రాసినాను, త్వరలో పై శాసనాన్ని వారు పరిశీలించి ప్రకటించగిలరని విశ్వసిస్తున్నాను.

ఈ సందర్భంగా కొన్ని ముఖ్యవిషయాలు—

౧ 'చందుపట్ల శాసనం' ఉన్న స్థలంలో శివాలయాలు గలవు. ప్రస్తుత శాసనాధారమూ ఉన్నది, కాని మా గ్రామస్థులు వాటిని ముత్యాలమ్మగుళ్ళని వ్యవహరించి — గ్రామజాతర (ఊరబోనాలు) సమయంలో జంతుబలులు నిచ్చి చాలా హేయంగా చేస్తున్నారు అధికారిక బలముతో వానిని మాన్పించి — యథాపూర్వ శివాలయంగా మార్పుచేయటం అవసరం.

౨ ఈ పరిసరాల్లో పూర్వం గ్రామము గలదేమో! ముఖ్యంగా ఉత్తరంవైపు చెరువుకట్ట వెంబడి ఈ లక్షణాలు దిబ్బలు అవశేషంగా ఉన్నాయి త్రవ్వకాలు జరిపిస్తే విశేషాలు బయలుపడుతవని నమ్మకము

3 సమీపంలోనేగల నకరెకల్లు ఊరివెలుపల పొలాల్లో ఒక శివాలయం ఉంది నా చిన్నతనంలో ఇప్పటి ఒక శాసన స్తంభం ఉండేది ఈ మధ్య మాస్తే అదిలేదు కాని దేవాలయం గోడలు తోలేవరకు మాత్రం పొలం ఆక్రమించి — ఆ స్తంభాన్ని మాయం చేసింది ఇది ప్రాచీన దేవాలయం విగ్రహాలున్నాయి. ఇక్కడ పరిశోధన — త్రవ్వకం సాగటం

చాలా అవసరం. క్రీడాభిరామ ర్త. నల గొండయు వకిరీకల్లును ధరణీసఫీన్ ప్రగల్భస్థలముల్ (121) అనె గదా! అదే నకరెకల్లు.

౪ హైదరాబాదు — విజయవాడ జాతీయ రహదారిపై నకరెకల్లుకు రెండు మైళ్ళదూరంలో 'ఇనుపాముల' అనే గ్రామం గలదు రోడ్డుకు ఒక ప్రక్క సుందర శిల్పాభిరామ మైన దేవాలయం ఉన్నది. రోడ్డుకు ఉత్తరంవైపు కూలి పోగా మిగిలిన కోటగోడలున్నవి. ఇప్పటికీ పాత స్తంభాలు, రాళ్ళు విరిగిన విగ్రహాలు, పెద్దబావి ఉన్నాయి. ప్రజలు గోడను కూలగొట్టి పాటిమన్ను తెస్తుంటారు. ఎవరెవరికో ఏమేమో దొరికినాయని జనశ్రుతి.

ఇదేరోడ్డు పిల్లలమర్రికి పోతుంది ఇవన్నీ సమకాల దేవాలయాలు. చారిత్రక ప్రదేశాలు. కాలగర్భంలో ఎంత చరిత్రను దాచుకొని రత్నగర్భ ఉంటున్నదో! మందలిస్తే తెలుస్తుంది. శాస్త్రిగారి పై శాసన విషయం కారణంగా వీటిని గూర్చి తెల్పగలిగినాను. అందుకు వారికి మరియొక మారు కృతజ్ఞతలు. భూగర్భ పరిశోధన శాఖవారు వీని విష యిమై శ్రద్ధవహింతురుగాత అని — ఆశంస.

—శ్రీ రంగాచార్య

* * *

శ్రీ రంగాచార్యులుగారు తమ పత్రికా లేఖయందు రెండంశములను తెల్పిరి.

ఇందు (1) అంశమునుగూర్చి దీనిలో వారు ఈ శాసనము యొక్క ఉనికినిగూర్చి తామే మొదట 1966 సెప్టెంబరు భారతిలో తెలిపితిమన్నారు. ఆ విషయము సత్యమేకావచ్చును. ఈవిషయముపై మరికొంత వారి లేఖలో వ్రాసియున్నారు. అందు "ఈ గ్రామంవద్ద శాసనంఉంది. ఇది ఇప్పటికే అక్షరాలు కానరాని స్థితికి వచ్చిందనీ ప్రభుత్వంవారు—ముఖ్యంగా భూగర్భ శాసన పరిశోధకవారు దీని ఫొటోతీయించి దీనిలోని విషయాలు వెల్లడింపగలరని కోరుతూ నేను 1966 సెప్టెంబరు భారతి పుట 73 ద్వారా తెలియజరచినాను' అని వ్రాసిరి కాబట్టి దీనిలోని విషయమునుగూర్చి వారేమియు వ్రాయలేదని స్పష్టము ఆ విషయమును గూర్చి వ్రాయుటను ఇతరులకు వారే వదిలిరి.

● ఇంతవు జరిగినదికూడ వారు కోరినదే కాగా వారు 1966 సెప్టెంబరులో భారతియందు తెలిపి, పురావస్తుశాఖ (భూగర్భశాఖ కాదు) కు తెలుపుట మున్నగు విషయములన్ని సమీక్షిగా సేకరించి చూచినయెడల 1966 నుండి 1974 వరకు సుమారు 8 యేండ్లు ఆలస్యమైనదని వారి భావము కావచ్చును దానికి కారణములు— ఈ శాఖయందు పరిశోధన కార్యక్రమము ఒక నిర్దిష్ట విధానము ననుస రించి జరుగుచుండును ఈలోగా వారివోటి సహృదయులు, చరిత్రాభి మానులు తెలియజేయు సమాచారమును సేకరించి ఆయాప్రాంతములు సర్వేచేయునపుడు అచటి శాసనములకు ప్రతులనుతీసి జిల్లావారీగా ప్రకటించుదుము. కనుక ఈ విధానములో నల్లగొండజిల్లా సర్వే ప్రారంభించిన తర్వాతనే దీనికి నకలు తీయుట జరిగినది. ఇది మొదటి ఆలస్యము. శాసనము వారు చెప్పిన రీతిగ అస్పష్టముగ నుండుటచే చదువుటయందు కొంత శ్రమకలిగి కొంత ఆలస్యమైనది. పూర్తి నిర్దుష్టపాఠము ప్రచురణ జరుగువరకు కొన్ని సందర్భములలో తుది రూపము తాల్చుదు కారణము అక్షరముల అదృష్టతయే. ఈ శాసన మట్టిది ఇది రెండవ ఆలస్యము. తాత్కాలికముగ పాఠమును మొదటవ్రాసుకొన్నను శాసనములోని విశేషములు వెంటనే స్ఫురించవు ఈ శాసనములోని ముఖ్యవిశేషము లెవ్వియు వాచ్యముగ చెప్పబడలేదు. అంటే రుద్రమదేవి యుద్ధమునందు మరణం నుహూట యందు లేదు అది ఊహమాత్రమే. అట్టి ఊహ మొదటి పర్యాలోచనలో స్ఫురించకపోవచ్చును. రెండవ లేక మూడవతూరి చదువునపుడు మనస్సునకు తట్టును. దీని విషయమట్లే జరిగెను. అప్పుడే మరల స్పష్టమగు ప్రతులను సేకరించి వీలగునంత నిర్దుష్టమగు పాఠ మును ఇచ్చి ప్రకటించితిమి. ఇంకను సంశయములున్నవి. కనుక ఈ పాఠనిర్ణయము, విషయమును గ్రహించుట అను అంశములపై కొంత ఆలస్యము జరిగెను. తరువాత వారు కోరిన విధముగ విషయ

ము:ను వెల డించితిమి వారు కోరకున్నను, ఇది పురావస్తుశాఖ యొక్క నిర్ణీతమగు సర్వేక్రమములో ప్రకటింపబడెడిది శ్రీ రంగాచార్యులుగారు (పాలెం) శ్రీ తేజాల సత్యనారాయణగారు (నల గొండ) శ్రీ వి. శేషాచారిగారు (రాయచోటి) శ్రీ గడియారము రామకృష్ణ శర్మగారు (ఆలంపూర్) శ్రీ బి యన్ శాస్త్రిగారు (హైదరాబాద్) శ్రీ యాదగిరిరావుగారు (బోధను, శర్కరనగరు) మున్నగు పరిశోధకులు, చరిత్రాభిమానులు పురావస్తుశాఖకు అనేక విధములుగ సమాచారమునందించుచున్నందుకు ఈశాఖయందుపనిచేయుఉద్యోగులు సర్వదా వారికి కృతజ్ఞులు వారి సహకారము ఎల్లప్పుడు కోరబడుచున్నది ఇటి సహాయమొనర్చిన సహృదయులగు మిత్రులకు కొంత మంది పేర్లు వ్రాయుట, కొంతమందిపేర్లు వ్రాయకుండుట జరుగుననియు దానివలన ఈ మిత్రులలో, కొందరికి న్యూనతను కొందరికి ప్రాధాన్యమును ఇచ్చుట జరిగి అనుచితమగు విపరీతాభిప్రాయములకు తావొసగునను భీతితో సాధారణముగ వారికీ ముఖతః కృతజ్ఞతలు చెప్పుకొందుము ఇట్టి సహకారము నంద జేయుచున్న తత్తద్దా మాదికారులు, ఉపాధ్యాయులు, దేవస్థానము లందలి అధికారులు, అర్చకులు, విషయాసక్తిగల విద్యార్థులు మున్నగు సహృదయు లందరకు మేము సర్వదా కృతజ్ఞులము.

శ్రీరంగాచార్యులుగారు చందుపట పరిసరములలోను వకరికల్లు గ్రామ పరిసరములందును ఇంక కొన్ని ప్రాచీన అవశేషము లున్నట్లు తెలిపి యుండిరి వాటిని గూర్చి ఆ శాఖోద్యోగులకు తెలుపుదుము. వారి కార్యక్రమము ననుసరించి వారు తగుచర్య తీసుకొందురు. వారి లేఖ బారతిలో రానున్నది కనుక తదుపరి అందలి విషయము సేకరింపబడును

ఇంక వారు వ్రాసిన రెండవ అంశము శాసనము వారి గ్రామం లోనిది గనుక వారు శద్ధవహించి వ్రాయుచున్నామన్నారు చాల సంతోషము. ఇట్లు ప్రతి గ్రామంలోని వారు తగు శ్రద్ధతో ఆ యా ప్రాంతములోని మన ప్రాచీన చరిత్రను, సంస్కృతిని ఉద్ధరించుట మిక్కిలి అవసరము. అట్లే ప్రాచీన శిల్పఖండములను, శాసన శిలలను ఇప్పటికున్నవాటినైన పరిరక్షించుటలో కూడ తగు శ్రద్ధాసక్తులను ప్రదర్శించుచో పురావస్తు శాఖయేకాక భావితరముల వా రందరు వారికి కృతజ్ఞులై యుందురు

శ్రీరంగాచార్యగారు నేను ఇంతవరకు ప్రకటించలేదని చెప్పిన ఈ చందుపట లోని రెండవ శాసనము చరిత్రవిషయములో అంత ప్రధానమైనది కాదు కనుక జిల్లా శాసన సంపుటము లో ప్రచురితమగును.

— శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి.

# "ఈ నాటి కవిత"

జనవరి నెల "భారతి"లో శ్రీ గంగిశెట్టి లక్ష్మీనారాయణగారి 'ఈ నాటి కవిత' అనే విమర్శనాత్మక వ్యాసంలో 'ఝంఝ'పై విసుర్లను, ముఖ్యంగా నా జీవిత 'మహోషస్సు' గురించి వ్యాసకర్త వెలువరించిన అభిప్రాయాలను చదివేక మిన్నకుండలేక వ్రాస్తున్నాను.

విమర్శ టానిక్ వంటిది ఆ టానిక్ మంచిదయితే మనిషిని బలవంతుడిగా చేస్తుంది అలా కాకుండా కల్తీది, సరియైనది కాకుంటే మనిషికి ప్రమాదాన్ని తెచ్చిపెడుతుంది లేని రోగాలనుకూడా తెచ్చిపెట్టడానికి అవకాశం వుంది. అలాగనే, విమర్శ అనేది సహేతుకమూ, శాస్త్రీయమూ అయినప్పుడు సాహిత్యానికి ఎంతో మేలు కలుగుతుంది. అవి కొరవడినప్పుడు విమర్శవలన సాహిత్యానికి ఏ మాత్రం న్యాయం జరుగకపోగా, సాహిత్యానికి లేని రంగులను అస్తవ్యస్తంగా పులిమి, దాని ఔన్నత్యాన్ని, రూపాన్ని దిగజార్చేస్తుంది. ఈ చివరి కోవకు చెందినదే శ్రీ గంగిశెట్టి లక్ష్మీనారాయణగారి విమర్శనాత్మక వ్యాసం.

విప్లవ కవులు కాల్పనిక పద ప్రయోగాలను చేస్తున్నారని, అదేదో పెద్ద తప్పుగా బావించి విమర్శిస్తూ 'ఝంఝ' లోని నా కవిత 'మహోషస్సు' చివరి పంక్తుల్ని వుదాహరించారు :

ఈ కవిత
కనువిప్పును కలిగించే రోచిస్సు
మహోషస్సు
ప్రభాసరసు .

ఇది వ్యాసకర్త వుదాహరించిన నా కవితలోని సంకు లు నా కవితలొని చివరి పంక్తుల్లో చివరి పదాలను మాత్రమే తీసుకుని

విప్లవ కవులు కాల్పనిక పద ప్రయోగాలు చేస్తున్నారనడం వ్యాసకర్త తొందరపాటుకు కొండగుర్తు.

"నా కవిత
కనువిప్పును కలిగించే రోచిస్సు
"పెను చీకట్లను పోకార్చే మహోషస్సు
నవ యువ విప్లవ రచనా ప్రభా సరస్సు"

అందులో కాల్పనిక వాసనలున్నాయన్న శ్రీ లక్ష్మీనారాయణ గారి ఆరోపణ ఎంతవరకూ వాస్తవమో విజ్ఞతగల సాహితీపరులే నిర్ణయించాలి. కాల్పనిక భావనలు వున్నాయని ఆరోపించే ముందు 'ఝంఝ' కు 'పీఠిక' వ్రాస్తూ మొదట్లోనే శ్రీ కె. వి రమణా రెడ్డి గారు చెప్పిన మాటలను జాగ్రత్తగా వ్యాసకర్త గమనించి వుంటే బాగుండేది.

'విప్లవ రచయితల సంఘం ఏ సాహిత్య సంస్థకూ పోటీగా ఏర్పాటు కాలేదంటే చాలామంది నమ్మకపోవచ్చుగాక, ఇది నిజం! సమకాలీన చరిత్ర దీనికి పుట్టిల్లు."

గత చరిత్ర ప్రభావం సంఘంపై ఎప్పుడూ వుంటూంది. అలాంటప్పుడు సమాజ జీవితాన్ని ప్రతిబింబించే రచనల్లో ఆ ప్రభావం వుండడంలో దోషం ఏమిటి? అదేదో పెద్ద తప్పు అయినట్లుగా పనిగట్టుకుని రంధ్రాన్వేషణ కొనసాగించడం మార్పుకు యిచ్చగించని ఛాందసుల నైజం.

—శ్రీ ప్రభాకర దేవ్.

* * *

1974 నవంబరు నెల మాసపత్రికలో 'కలగూరగంప' శీర్షిక క్రింద "నన్నపార్యుడు - జపహోమ తత్పరుడు - సంహితాభ్యాసుడంటే" అను విషయమును గూర్చి శ్రీ షడ్దర్శనం సోమసుందర శర్మగారు వివరించుచు ప్రథమముగా "కుల బ్రాహ్మణ" శబ్దమును గూర్చి చెప్పిరి. అందు కుల బ్రాహ్మణ శబ్దమును నన్నయ వాడెను ఆ పదమును పరిశీలించిన తిక్కన "కులభూపతి" అని విరాట పర్వమున గోగ్రహణ సందర్భమందలి "విరటుడు నిన్నునెపు" అను పద్యమున వాడినాడని వ్రాసిరి. ఆ పద్యమందు "భూపతి" పదము ఎక్కడ వెదకినను లేదు, అది "భూతి" యను పదము. పైగా భూపతియని సరిపెట్టుకొందమన్న చంపకమాల వృత్తమున గణభంగమై పాదమున ఇంకొక అక్షరము అధికమగుచున్నది. నాకు తెలిసినంతలో వావిళ్లవారి ప్రతిలోగాని మరి యే యితర ప్రతిలో గాని అట్టి పాఠము లేదు. శ్రీ శర్మగారట్టి పాఠము నెచట చూచిరో తెలియదు అదియునుగాక దగ్గర దగర 7 సం.ల నుండి "ఉత్తర ప్రగల్భము"లను పాఠమును బోధించుచున్నాను నాకు అట్టి పదమున్నట్టుల గూడ తోచలేదు కావున శ్రీ శర్మగారు ఆ పాఠమును పొరబాటుగా వ్రాసి యుందురని మనవిచేయుచున్నాను. నాది పొరపాటైనచో వివరించుచు ప్రత్యుత్తర మీయవలసినదిగా మిమ్ము కోరుచున్నాను

—శ్రీ అన్నావఝ్ఝల వేంకటరమణయ్య, కనిగిరి.

* * *

నవంబరు 74 భారతిలో కలగూరగంపలో నా వ్యాసము (నన్నయ జపహోమ తత్పరతపై వ్రాయబడిన వ్యాసము) ప్రకటించియున్నారు.

అందులో నన్నయ వాడిన కుల బ్రాహ్మణ పదమును తిక్కనయు పరిశీలించి, పై 'కుల' పద విశేషణ విశిష్ట "కుల భూతి' పదమును వాడి యుండనోపు అనియే నా భావముగా వ్రాసితిని.

ఎన్నడో భారతము పరిశీలించి యుంటిని. ఆనాడు నేర్చిన పద్యములను కంఠస్థమున నున్నంతలో 'కులభూతి' కులభూపతిగా పొరబడి రచన దొర్లినది 'భూతి' యని యనక భారతి రాగానే చూచి, పొరపాటైనదే!! యని భావించితిని. ప్రమాదవశాత్తుపడినదని చింతించితిని

ఇంతకు నా వ్యాస ముఖ్యోద్దేశ్యము, కుల బ్రాహ్మణ, కుల

భూపతి పదాల చర్చ గాదు నన్నయ విశేషణాలయుంతరార్ధ వివరణము గాని 'భూతి, భూపతి' పదాల వివరణము గాదు.

(1) సంహితాభ్యాసుడంటే! జప హోమ తత్పరుడంటే యేమిటని ? యందలి భావాల వివరణము వ్రాయుచు మిగతా విశేషణములను వివరించుచు, తిక్కన సహితము 'కుల' పద విశేషణమును నన్నయ రచన చూచి, చేర్చియుండనోపు అని నా భావన. అక్కడ భూతి గాని, భూపతిగాని ముఖ్యం గాదు అని మనవిజేతును.

—*శ్రీ షడ్దర్శనం సోమసుందరశర్మ ప్రొద్దుటూరు.*

○ ○ ○ ○

భారతి ఫిబ్రవరి 1975 సంచికలో శ్రీ పోతుకూచి సాంబశివరావు గారి ప్రాభాతము, కవిత చదివిన పిదప ఈ నాలుగు వాక్యాలు వ్రాయాలనుకున్నాను. ఇన్నేళ్లనుండి 'భారతి'లో సాంప్రదాయ కవితలూ, అధునాతన ప్రక్రియలకు చెందిన కవితలూ ప్రచురింప బడుతున్నవి. ఏదో ఒక శైలీ, ఊపూ, లయా లేనిదే వచన కవితా ప్రక్రియ పాఠకుణ్ణి ఆనందింపజేయలేదు. అందుకే ఆ ప్రక్రియలో విశేష కృషి చేసిన శ్రీశ్రీ పద్య కవిత్వం వ్రాయడంకన్నా, వచన కవిత్వం వ్రాయడమే కష్టమైన పని అన్నారు. పై కవితలో లయా, శైలీ ఎట్లున్నా వాడిన భాష అటు సంస్కృత సమాస బంధురమూ కాదు, ఇటు తేటతెలుగుపదాల అల్లికా కాక అయోమయంగా ఉంది. 'చిరు చలివెలుగులు' వంటి పదాల వెంటనే 'మదీయ కవితా సమారాధనవేళ' వంటి దీర్ఘ సంస్కృత సమాసాలూ వాడడంవల్ల కవితలో బిగువు సడలిపోయే అవకాశం ఉంది. తిలక్ కవితలలో ఈ లోపమున్నా ఆయన తనదైన శైలితో పరమ రమణీయంగా, రసబంధురంగా తన కవితలను తీర్చి దిద్దుకున్నాడని శ్రీ కుందుర్తి అన్న మాటలు ఇక్కడ గమనార్హాలు. ఏమైనా వచన కవితా ప్రక్రియ అయోమయ మార్గంలో పయనించకుండా ఉండాలంటే దోషభూయిష్టమైన పదజాలం దొరలకుండా జాగ్రత్తపడడమే సాహితికి ఆరోగ్యకరం. 'యౌవనకలలు', 'చరమ దశదిసెలు', 'ఆనందమధు సమన్విత మెరుపు'వంటి పదజాలాన్ని వచన కవిత్వం కాదుగదా మరే అధునాతన కవిత్వం జీర్ణించుకోలేదు. ఛందస్సుల సర్పపరిష్వంగాలు వదలినా వ్యాకరణాల సంకెళ్లను త్రెంచినా, శ్మశానాలవంటి నిఘంటువులను దాటినా శ్రీశ్రీ కాని ఆయన అనుయాయులైన వచన కవులుగా లబ్ధప్రతిష్ఠులైనవారుకాని పైన ఉదాహరించిన పదజాలాన్ని ప్రయోగించినట్లు దాఖలా లేదు, ఒకవేళ ఆంధ్రాంగ్ల మిశ్ర సమాసాలను వాడిన "ఆరుద్ర"వంటి కవులను పేర్కొన్న వారు ప్రత్యేకమైన వరవడిలో రచన చేయడానికి పూనుకొన్నవాళ్ళే. ఐనా ఆధునిక కవిత్వంలో ఆంగ్ల పదాడంబరం ఆరోగ్యకరమైంది కాదని కుందుర్తి మొదటినుంచీ అంటూనే ఉన్నారు.

వచన కవిత్వం ఓజోవంతంగా వృద్ధి పొందాలంటే దాని రచనలో ఎంతో జాగ్రత్తపడవలసిన అవసరం ఉందని మనవి చేయడానికే ఈ నాలుగు వాక్యాలు వ్రాశాను.

ఈ లేఖను మీరు ప్రచురించకున్నా, మీరాలోచింపగలిగితే దీని ప్రయోజనం చేకూరినట్లే.

—*తిరునగరి, కవితా సదన్, ఆలేరు*

## నూరా ? వందా ?

ఈమధ్య రేడియోలలో నైతేమి, పత్రికలలో నైతేనేమి 'వంద' యొక్క ఉపయోగము జాస్తి ఆయి 'నూరు' మూలపడుతోంది. నూరు ఒక్క మారుగానే వాడబడుతూ. బహువచన రూపా లయినే ఇన్నూరు, మున్నూరు, నన్నూరు, ఐదునూర్లు మొదలైనవన్నీ వాడకములోంచి తొలగింపబడుతున్నాయి చాలామంది-కోస్తాఆంధ్రులకు ఇన్నూరు, మున్నూరు అంటే అర్థం కాదంటే అతిశయోక్తి లదు

రెండు వందలు, మూడు వందలు మొదలయిన రూపాలు వ్యాకరణ రీత్యా తప్పులు ఈ ఉదాహరణలు గమనించండి.

| ఒప్పు | తప్పు |
|---|---|
| ఇద్దరు | రెండు మంది |
| ముగ్గురు | మూడు మంది |
| ఇన్నూరు | రెండు వందలు |
| మున్నూరు | మూడు వందలు |

రెండు మంది, మూడు మంది మొదలయిన రూపాలు ఎలా తప్పో అలాగే రెండు వందలు, మూడు వందలు మొదలయినరూపాలు కూడా తప్పే

ఈ వంద ఎప్పుడు వ్యుత్పత్తి అయిందో తెలియదు ప్రాచీన కావ్యాలలో దేనిలో కూడా 'వంద' వాడబడలేదు రాజమహేంద్రవర నివాసిఅయిన నన్నయ కూడా తన భారతములో ఇన్నూరు మున్నూరు మొదలగు రూపాలను వాడినాడే కాని వందలను వాడలేదు. నన్నయ భారతములో పర్వ సంగ్రహాన్ని పరిశీలిస్తే ఈ విషయం విశద మవుతుంది.

ఇన్నూరు,మున్నూరులను లెక్కల పేపర్లలో వాడితే మార్కులు ఇవ్వడము లేదు. ఇంతకంటే ఘోరం మరొకటి వుండదు. కాబట్టి ప్రభుత్వమువారు ఈ ప్రాచీన రూపాలను కూడా అచ్చుపుస్తకములలో పత్రికలలో, రేడియోలలో వాడడానికి సూచనలు ఇవ్వాలని మనవి చేస్తున్నాను. ఈ విషయాన్ని పెద్దలు పరిశీలిస్తారని ఆశిస్తున్నాను.

—*శ్రీ టి. మోహనరావు, హిందూపురం.*

# సంస్కృతములో చంపకమాలా మత్తేభ వృత్తములు

**1974** ఏప్రిల్ నెల భారతిలో 'సంశోధిత మహాభారతము—అనుశాసనికపర్వము' అను వ్యాసమును భారతీ పాఠకులు చూచియే యుందురు. అందు వ్యాసకర్తగారు కళాప్రపూర్ణ శ్రీ నిడదవోలు వేంకటరావుగారు 47 వ పుటలో 'చంపకమాల, ఉత్పలమాల రెండును సంస్కృతీయ వృత్తములు కావు — అవి సంస్కృతమున లేవని—అవి అపూర్వ వృత్తములని యిూవరకే నిశ్చయింపబడిన విషయము' అని వ్రాసి 'క్రీ. శ. 848–892 ప్రాంతముల తెలుగు దేశము పాలించిన గుణక విజయాదిత్యుని శాతలూరి శాసనమునగల సంస్కృత చంపకమాలా వృత్తమును వ్రాసి 'దీని ననుసరించియే రాజశేఖరుడు మాఘుడు చంపకమాల సంస్కృతమున వ్రాసిరి ఇక ఉత్పలమాలకు సంస్కృతమున ప్రయోగమే లేదు. కావున నివి రెండును సంస్కృత వృత్తములు కావు.' అని వ్రాసి అథోజ్ఞాపిక (ఫుట్‌నోట్) లో రాజశేఖరుడు మాఘుడు — గుణక విజయాదిత్యుని తరువాతివారు క్రీ. శ 10 శతాబ్దివారు.' అని వ్రాసినారు. పిదప 1975 ఫిబ్రవరి నెల భారతిలో 'మాఘకవి' తెలుగు కవిత' అను వ్యాసమును ప్రచురించుచు అందు ఈ వ్యాసకర్తగారు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు ఆ కవిరాజుల కాల చర్చా పూర్వకముగా 'చంపకమాలాది వృత్తములు సంస్కృతములో నుండునవిగానే గ్రహింపవలెను' అని అనాదిగవచ్చు సిద్ధాంతమును దెలిపిరి. అందు ఈ వ్యాసకర్తగారు చంపకమాలకు ఒక్క మాఘుని కావ్యములోని శ్లోకమును మాత్ర ముదాహరించి వదలిరి. నేను ఆ వ్యాసమునకు పరిశిష్టముగా నిందు చంపకమాలా లక్షణము జెప్పిన ప్రాచీనములైన సంస్కృత చ్ఛందశ్శాస్త్ర గ్రంథములను, దీనిని చెప్పిన మరి రెండు మూడు పూర్వ గ్రంథములను, అట్లే మత్తేభ విక్రీడితమును నుడివిన ఒకరిద్దరు కవులను వారి గ్రంథములను ఇందు ఉదాహరించుచున్నాను. ముందు చంపకమాలా వృత్తమును గురించి వ్రాసెదను

సమస్త భాషల కంటెను సంస్కృతములోనే ముందు కవిత్వమేర్పడెనన్న విషయము సర్వజనాంగీకృతము ఆ కవిత్వమునకు లక్షణప్రతిపాదకములైన గ్రంథములు పింగళచ్ఛందస్సు మొదలయినవి కలవు. పింగళ చ్ఛందస్సు ఆర ము. అనగా ఋషిప్రణీతము. విస్తృతమైనను సంక్షిప్తమైనను ఆర గ్రంథము మానుష గ్రంథముల కంటెను పూర్వమనుటలో సందేహములేదు. ప్రకృతము చర్చకు గురియైన చంపకమాలా వృత్తమునే కొందరు చంపకావళీ లని, మరి

కొందఱు రచితా అని, ఇంక కొందరు శశివదనా అని మఱి కొందఱు ధృతశ్రీ అను మున్నగు పేళ్లతోను దీనిని వ్రాసియున్నారు. అందులో పింగళాచార్యులవారు ఛందశ్శాస్త్రమునందు శశివదనా అని దీని లక్షణమును చెప్పియున్నారు ఎట్లన? 1. పింగళచ్ఛందస్సు-2. అధ్యాయే'శశివదనాన్త్యౌ భ్జౌజ్ జౌ రుద్రదిశః'అని ౧౯ సూత్రము.

ఈ సూత్రమునకు భట్టహలాయుధ వృత్తి పంక్తులు-

"యస్య పాదే నగణ జగణౌ భగణో జగణాస్త్రయో రగణ శ్చ భవతి- త ద్వృత్తం శశివదనా నామ గాథా ఏకాదశక్షర్యశభిశ్చ యతిః. పంచకావళీతి కేచిత్ త త్రోదాహరణం .... అని వ్రాసి మాఘ కావ్యము 3వ సర్గాంతమునందలి "తురగ శతాకులస్య. . అను శ్లోకము నుదాహరించినాడు. ఈ శ్లోకమును వెనుక వ్రాసెదను

2. కాళిదాసు వృత్త రత్నావళిలోను దీని నీపేరుతోనే చెప్పియున్నాడు. ఆ శ్లోకము-

"నిజ భుజ జర్జరీకృత పటీర కుచాగ్ర దృఢోప గూహనం, విజిత సుధారసాలపితలీల మనేక విలాసభాసురం, సహి భువి భోగమేతి సుదృశామపి దివ్యపదం పరాత్పరం, శశివదనా త్వ మంబ హృది యేన శుచిద్యుతిమత్యుపాస్యసే.... అని యిందులో ని-జ-భు-జ-జ-ర్-జ-రీ-అను ప్రథమ పాదాది యందలి యక్షరములు ఈ వృత్తముయొక్క గణబోధకములు. ఎట్లన: ని-నగణము, జ-జగణము, భు-భగణము, జ-జ-జగణము, ర్ ప్రక్కమందు జకారము జగణ చిహ్నము. రీ రగణము.

3. మల్లినాథ సూరి మాఘ కావ్యము తృతీయ సర్గ చివరన "శ్లో. తురగ శతాకులస్య పరితః పర మేక తురంగ జన్మనః" అను శ్లోకముయొక్క వ్యాఖ్యానముకడను దీనికి చంపకావళి యనియు, రచిత యనియు రెండు పేళ్లను బేర్కొని ఛందోగ్రంథముల నుండు లక్షణ శ్లోకములను దెలిపియున్నాడు. అది "న జ భ జ జా జ రా హరయతిః కథితా భువి చంపకావళీ" తి లక్షణాత్, రచితేతి కేచిత్. శ్లో న జ భ పురస్కృతా జ జ జ రా రచితా భువి రు ద దిగ్యతిః. రితి లక్షణాత్" అని. ఇట్లే అనేక ఛందో గ్రంథముల యందు ఈ వృత్తముయొక్క లక్షణములు వాని వ్యాఖ్యలయందు ఉదాహరణ శ్లోకములును చూడదగినవి.

ఇకను కావ్యములలో -

మాఘమహాకవి శిశుపాలవధ 3 వ సర్గ చివర శ్లోకము ఈ వృత్తము. అది

శ్లో. తురగ శతాకులస్య పరితః పర మేక తురంగ జన్మనః
ప్రమథిత భూభృతః ప్రతి పథం మథితస్యభృశం మహీభృతా
పరిచలతో బలానుజ బలస్య పుర స్సతతం ధృత శియ
శ్చిర విగత శ్రియో జలనిధేశ్చ తథా భవ దంతరం మహత్ (53)

2 ఆచార్య హేమచంద్రుని కావ్యానుశాసనమునందు 3 "వర్గ ...తం యథా" అని దానికి ఉదాహరణముగా నీ వృత్తముతో శ్లోకము కలదు.

శ్లో. సిత నృశిర. ప్రజా రచితమౌళి శిరోమణి మౌక్తికై స్తథా
శిఖి రుచిరోర్ధ్వదృక్ పృథు లలాటత టే తిలకక్రియా చ సా
స్ఫుట వికటాట హాస లలితం వదనం స్మిత పేశలంచ తద్
అభినవమీశ్వరో వహతివేషమహో? తుహినాద్రిజార్ధ యుక్?

అని. (ఇది తెనుగులో గర్భ కవిత్వము అని చెప్పబడు చిత్ర కవితా విశేషము. ఈ శ్లోకముయొక్క గర్భమునందు ఈశ్వర వర్ణన పరమైన "నృశిర ప్రజా రచితమౌళి శిరో ... ఇత్యాదిగ ప్రమితాక్షరా వృత్తము, "రచిత మౌళి శిరోమణి మౌక్తికైః . . ఇత్యాదిగ పార్వతీ వర్ణనపరమైన ద్రుతవిలంబిత వృత్తమును కలవు. వాటి వివరణ మిచ్చుట అప్రస్తుతము కనుక మానివేసితిని)

5 రాజశేఖరకవి కావ్య మీమాంస ౧౩ వ అధ్యాయమునందు మాణిక్య పుంజ మనెడి యర్థహరణమున కుదాహరణముగ నీ వృత్తమును రచించి యున్నాడు అది-

శ్లో. రజని పురంధ్రలోధ్ర తిలక స్తిమిరద్విప యూథకేసరీ
రజతమయోభిషేక కలశ కుసుమాయుధమేదినీపతేః
అయ ముదయాచలైక చూడామణి రభినవ దర్పణో దిశా
ముదయతి గగనసరసి హంసస్య హంసస్య విభ్రమం శశీ"

దీని తర్వాత రెండవ శ్లోకమును

శ్లో. వియతి విసర్పతీవ కుముదేషు బహూభవతీవ యోషితాం
ప్రతిఫలతీవ జరఠశరకాండ పాండుషు గండభిత్తిషు
అంభసి వికసతీవ లసతీవ సుధాధవళేషు ధామసు
ధ్వజపటపల్లవేషు లలతీవ సమీరచలేషు చంద్రికా'' అని.

(ఈ యుదాహృతములైన రెండు శ్లోకముల యందు తొలి దానిలో ఉత్తరార్ధము రెండు పాదములు, రెండవ దానిలో ౨-3 పాదముల గణములు విచారణీయములు.)

ఇట్లు అన్వేషించితిమేని యెన్నియో గ్రంథములలో దీనిని తిలకింపను చూడగలము. ఆంధ్రదేశమునకు ఎంతయో దూరదేశవాసులైనను పై ఛందశ్శాస్త్ర—కావ్యకర్తలైన పింగళాచార్య మాఘాద్యాదులు ఆంధ్రదేశములో-నందును గ్రంథములలోకాక ఒక గ్రామములో నెచ్చటనోవేసి యుండెడు శిలాశాసనము జూచి అందలిశ్లోకము ననుసరించి సంస్కృతములో వ్రాసిరనుట పొసగనిమాట. కనుక చంపకమాల సంస్కృతీయమే.

ఈ సందర్భములో—నాచేతను రచితమైన ఈవృత్తమును మదీయ చిత్రబంధ శ్రీనివాసము, అను గ్రంథమునుండి యెత్తి యిచ్చుట తెలుపుచున్నాను.

కోకిలకవృత్త—రామస్తవ ప్రమితాక్షరావృత్త—కృష్ణస్తవ స్వాగతావృత్త—లక్ష్మీస్తవ ద్రుతవిలంబిత వృత్తనామ చతుశ్శ్లోకగర్భ చంపక మాలావృత్తమ్—

"శ్లో. జయ రఘువంశరాడ్ధరసుధైర్యనిధే హిశుభం రమేట్కురు
శ్రియ మమరామ సోదరజగత్త్రయ కల్యఘహ ప్రసుందర
భవహర శస్త భో ధురి నమో భవతేస్తుత హేమఖాసుర
ఫణినర భూధరేడ్వర సముద్ధృతి శస్తకర క్షమేశ్వర.''

అని.

ఇచ్చట గమనార్హమైన యంశము—చంపకమాల యనినను చంపకమాలిక యనినను ఒక్కటే వృత్తమని తలంచి కొందఱు పై శ్లోకమునకే రెండు నామములను వాడుచున్నారు అది తప్పు. చంపకమాల సమవృత్తములలోనిది. ప్రకృతి ఛ్ఛందస్సులోనిది. కనుక పాదమునకు ౨౧ అక్షరములు కలది. ఇకను చంపకమాలికావృత్తమన్ననో అర్ధ సమవృత్తములలో చేరినది. బేసి పాదములకు ౧౦ యు సరిపాదములకు ౧౧ ను అక్షరములు కలది. కనుక రెండుపేళ్లు నొక్క వృత్తమునకు జెప్పదగవు.

సంస్కృతములో ౧౦ వదియగు పఙ్క్తి చ్ఛందస్సునందును (పాదమునకు పదేసి యక్షరములుకల) మఱియొక చంపకమాల కలదు. తల్లక్షణము — వృత్తరత్నాకరే 3 అధ్యాయే "శ్లో. చంపకమాలా చేద్భ మ సౌ గః.'' అని ప్రతిపాదములో భగణము మగణము సగణము ఒక్క గురువునుండును. (ఈ చంపకమాల చిన్నది)

ప్రకృతము చర్చకు గురియైనది. ప్రకృతి ఛ్ఛందస్సులోనిది. పాదమునకు ౨౧ అక్షరములు కలది పాదము ౧౧ వ అక్షరము ౧౦ వ అక్షరము యతులు. యత్యక్షరముగాక కడమ పదియక్షరములు గల పాదాంతము రెండవ యతిగా నెఱుంగవలెను. మల్లినాథసూరి మాఘకావ్యమునందలి "తురగశతాకులస్య.'' అను శ్లోక వ్యాఖ్యానములో నిచ్చిన 'న జ భ జ జా జ రా హరయతి కథితా భువి చంపకావళీ' అను లక్షణ శ్లోకము నందలి హరయతిః అను పదము ఈ వృత్తమునందు రెండు యతి స్థానములను బోధించునది. ఎట్లన? హరశబ్దము పదసంకేతముతో ౧౧ కనుక పదకొండవ యక్షరమైన మొదటి యతికి సంజ్ఞ. అదియే "శ్లో. పాద్యాః పంచక్రమాదంకాః... అను శ్లోకోక్తమైన యక్షరసంకేతము ననుసరించి ర—౨, హ—౮, ౮+౨ ౧౦. ఇది రెండవ యతికి సంజ్ఞ ("అంకానాం వామతో గతిః'' అను శాస్త్రముచేత అంకెలకు సంకేతముగ వాడబడిన యక్షరములను కుడినుండి యెడమకు దీసుకొని లెక్కించుట సంప్రదాయము.)

—శ్రీ విక్రాల శేషాచార్యులు.

# కర్తవ్యము

**దాశరథి**

భగ భగ మండు భాస్కరుడ
　　వై వెలుగొందుట పీలుకానిచో
సొగసులు చిందు చుక్కవయి
　　శూన్య పథమ్మున శోభనింపుమా!
జగతి మహావటంబవయి
　　శాఖలు సాచకయున్నమానె, సం
పెగవయి తావులన్ చిలుక
　　మీ రసికావళిగుండెలందువన్
రథములు సాగిపోవగల
　　రాజపథంబవు కాకపోతివన్
వ్యథ వలదోయి, కాననము
　　లందున సన్నని కాలిబాటవై
కదలుము, పేద పేదముల
　　కంటకరాశి భరింపలేక నీ
యెదవయి సేద తీర్చుకొను
　　వేగును కాల మహా పథమ్మునన్
జ్యోతిరోళమవై దిశాంచలములన్
　　శోభించ లేకున్నచో
నీ తేజమ్మును చిన్ని * తిర్యాళకలో
　　నిండింపుమీ; అంధకా
రాతంకమ్ము తొలంచు కిలికలు
　　యందున్నవోయ్! ఓయీ
పేతా! నమ్రత నీకు రక్షయయి క
　　ల్పించున్ మహానందమున్
దమ్ముంటే తోటలు నాటు,
　　ఈటెలు నాటుట మానుమురా!
బలముంటే కలమును నడుపు,
　　కలహము నడుపుట కూడదురా!
శక్తి ఉంటే రసాన్ని చిందు,
　　రక్తం చిందుట నేర్వకురా!
వీలైతే ప్రణయం పెంచు,
　　ప్రళయం దించుట ఘోరమురా!
మనసైతే మల్లెలు విసరు,
　　రాళ్ళను విసరుట వద్దుసుమా!
అడిగినచో దారి చూపు,
　　పెడదారి చూపడం తగదుసుమా!

# గ్రంథ సమీక్షలు

## కన్యాశుల్క నాటక కళ :

శ్రీ సరే శాయి తిరుమలరావు డెమ్మి– 298 పొరటలు.

వెల రూ. 15 ప్రతులకు జె ఎస్ భీమసేనరావు,

14/150 కమలా నగర్ – అనంతపురం.

గురజాడ అప్పారావు, ఈ శతాబ్దాదిలో తెనుగుకు క్రొత్త దారులు చూపిన పెద వారిలో ఒకరు అనడం వెలితిలేనిమాట– కాని వారే యుగపురుషుడనడం మాత్రం అతిశయోక్తి. సర్వవిధ నూతన ప్రక్రియలను ప్రవేశపెట్టిన కందుకూరు వీరేశలింగం పంతులుకు యీ బిరుదం తగిఉంటుందేమో వాడుక భాషావాదం మరల తలఎత్తే దానికి మూలం గిడుగు రామమూర్తి అంటే ఒప్పు ఉంటుందేమో! అప్పారావు ఆ దివ్వెతో దేశం నలుమూలలా ఆవానపు తిల్లి కల వెలిగించినాడు

ఈ గ్రాంధిక వ్యావహారిక (గ్రామ్యం కానే కాదు) భాషా స్వరూపం, సంస్కృతంలో వైదిక లౌకిక భాషల వంటిదిగా ఉన్నట్లున్నది తెనుగునాట గ్రంధ భాష ఒకటి– శాసనాదుల రాజకీయ భాష ఇంకొకటిగా ఉండినది. ఈ వ్యత్యాసం బాగా కనబడుతున్నది. నన్నయ, శ్రీనాధుడు మొదలగువారు వ్రాసిన శాసన భాషకు, వారి కావ్యభాషకు చాల భేదమున్నది ఇంతెందుకు ? ఈ సంప్రదాయాన్ని యీ శతాబ్దంలో నిండ్రదొక్కిన చిన్నయసూరే హిందూ ధర్మశాస్త్రాన్ని (Main's Hindu Law) సరళమైన వాడుక భాషలో వ్రాసి 7, 8 ముద్రణములు వేయించినాడు కావ్యానికి యీ జన సామాన్య భాష బాగుండదని వీరు ఊహించినట్లున్నది వాడుక భాషనే పాత్రోచిత భాష అని (సంస్కృత నాటకాలలో స్త్రీపాత్రల మాదిరి) వేదంవారు గురజాడవారు మొదట, ఒకే సమయంలో, మూడు నాలుగు నెలలు అటుఇటుగా తమ నాటకాలలో ప్రవేశపెట్టినారు. దీనిని గామ్యం అనగా గిడుగు రామమూర్తి శిష్య వ్యవహారభాష అని పేరుబెట్టినారు. సి. పి. బ్రౌను దొర రచనా వైఖరి అంతా యీ బాణిదే.

వాడుక భాష లంటే మాండలిక జాతియమే ! తిక్కన "ఆంధ్రావళి మోదమున్ బొరయ" చేసిటి నది ఇదే బాస శ్రీనాధుడు పోతన అప్పటి ప్రాంతీయ భాషనే ఎక్కువగా వాడినారు దీని భేదమంతా చివరి క్రియలలోనే కనబడుతున్నది. దీనికి మంచి తార్కాణం ఉన్నవ వారి "మాలపల్లి" భాష

గురజాడ వారు – "దేశమంటే మట్టికాదోయ్, మనుషులోయ్" అన్నది నవయుగ జాగృతి గీతమంటారు – ఒక వర్గంవారు. ఇది మంచి మాటల కూర్పే గాని, లోకం యింతకుముందు ఇట్టి వాక్యాల మొగమే ఎరుగదంటేనే ఏవగింపు పుట్టేది దేశాన్ని పట్టి మట్టి అనే పుసుకు లెందరున్నారు. ఒకేవిధమైన మంచి భావాలు భావుకులకు కలుగుతుంటవి నెపోలియన్ చక్రవర్తి, ఆ వలస దీవిలో బ్రిటిషు పభువు పాలనా విధానాన్ని గూర్చి విమరిస్తూ – "It is not a land full of nobles or rich men that makes a Nation, but the mass of people" - అన్నాడు. వివేకానంద స్వామి అంటున్నారు 'Whether the leadership of society be in the lands of those who monopolise learning, or wield the power of riches or arms, the source of its power is always the subject masses".

ఇది ఎలా ఉన్నా అప్పారావుగారి కన్యాశుల్కం (ఇప్పటి దారుణ సమస్య వరకట్నమైనా) ఆంధ్రుల స్వతంత్ర నాటకాలలో ఎన్నిక బడవలసిన వాటిలో ఒకటి– అనక తప్పదు.

ఇక పుస్తకానికి వస్తాం : – సరే శాయి తిరుమలరావుగారు చాలా బాగా చదువుకొన్నవారు. మన సాహిత్యాలకంటే ఇంగ్లీషు వాఙ్మయమే వీరికి ఎక్కువగా ఒంటబట్టిన చదువుగా ఉన్నది విమర్శక పాండితి గూడ దొడ్డదే. ఒక్క నాటకం మీదనే 300 పేజీలు – 33 పొరటల పదసూచికతో, ఒక థీసిస్‌వలె వ్రాయగలగటం రావుగారి నేర్పరితనమైనా, వారి ఉత్సాహం అది అనిపించుకొంటుంది. నాటకాన్ని గురించి కూలంకషంగా చర్చించి, అందలి పాత్రలను గురించి

నాటకాలను గూర్చి ప్రత్యేక ప్రకరణాలుగా సుదీర్ఘంగా వ్రాసినారు ఈ విమర్శకుని పెద్ద లోపం— తాము చేపట్టిన గ్రంథాన్ని ఆకాశానికి ఎత్తిపెట్టి, అన్ని విషయాలలో— అన్ని సాహిత్యాలలో అదే ప్రథమ గణ్యమనడం హాస్యాస్పదంగా ఉన్నది. ఇది చేటు గూడా ఈ నాటకంలో ఆయనకు చీమతలకాయంత దోషం గూడ కనపడదు విస్తరలో పడిన గడ్డిపోచనుగూడా తినే విమర్శకుడని ఒక తరగతి సమీక్షకుడున్నాడే ఆ గణంలోనివాడు యీ గ్రంథకర్త. ఇదంతా నేల విడిచిన సాముగా కనబడుతున్నది.

లబ్ధావధాని, కరటకశాస్త్రి అనే పేర్లు పెట్టకుండానే వాళ్ళ చేత అట్టి వెధవ చేష్టలు చేయించి ఉంటే కళాత్మకంగా ఉండేది. ఒక కురూపిని సుందరయ్య అన్నట్లు.

రావుగారు, ఒక క్యాటలాగులో పేర్ల పట్టీ వలె, ఇంగ్లీషు వాఙ్మయంలోని రచయితల పేర్లు ఒక పెద్ద లిస్టు యిస్తారు వారు చెప్పినది ఉదాహరించక పేరు పేర్కొన్నంత మాత్రాన పాఠకునికి లాభం లేకపోగా, గ్రంథకర్త పాండిత్య ప్రకర్షకు గూడ పొందులేదు ఈ దోషం ఈ పుస్తకంలో అతివ్యాప్తి నొంది ఉన్నది. ఈ విధానం ఎండిపోయిన కొయ్యవంటిది.

గ్రంథకర్త మంచి చదువరి, చాలిన వ్రాతగాడు. విమర్శకశక్తి లెక్కకు వచ్చేది.

*— శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి*

# స్వాతంత్ర్యోద్యమ రథసారథులు

గ్రంథకర్త: ''సాహిత్య భూషణ'' పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు
వెల: రు. 5-00. ప్రతులకు; గ్రంథకర్త, ఖమ్మం.

''ఒక దేశ చరిత్ర అనగా ఆ దేశంలోని ప్రజల జీవిత చరిత్ర. ప్రజల జీవితచరిత్రను సమగ్రంగా వ్రాయడం సాధ్యంకాదు. కాబట్టి నాయకుల చరిత్రనయినా సమగ్రంగా వ్రాయగలిగితే ఒక జాతి చరిత్ర కొంతవరకయినా పరిచయమవుతుంది'' అంటాడొక చారిత్రక శాస్త్రవేత్త. ఈ దృష్టితో పరిశీలించాలి ఈతరం యువతీ యువకులు. 178 పుటలున్న ఈ పుస్తకాన్ని. ఎందుకు పరిశీలించాలో? వ్యక్తి శీలమూ, కట్టుబాట్లూ, కార్యదక్షత, లక్ష్యశుద్ధి అనగానేమో తెలుసుకొనుటకు, తెలుసుకొని ఉద్దీపనం పొందుటకు, ఉద్దీపనం పొంది వర్తమానంలో ఎదురవుతున్న సమస్యల స్వరూప స్వభావాల నవగతం చేసుకుని, పరిష్కారాన్వేషణ చేయుటకు ఇది సామాజిక ధర్మం. వ్యక్తి ధర్మముకూడా.

ఆచార్య నిడదవోలు వేంకటరావుగారు వ్రాసిన పీఠిక ఈ పుస్తకానికొక వ్యాఖ్యానము శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు—ఆంధ్రపిత అను శీర్షికను శ్రీ వేంకటరావుగారు (పీఠికలో) వ్రాసిన అంశాలు ఈ తరంలోని యువతీ యువకులలో చాలామందికి తెలియవు. ''గాంధీ మహాత్ముడు భారత పిత—నాగేశ్వరరావు ఆంధ్రపిత'' అన్నారు.

(1) శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు, (2) శ్రీ చిత్తరంజన్ దాస్, (3) డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య, (4) శ్రీ సుభాస్ చంద్రబోసు, (5) శ్రీ పొట్టి శ్రీరాములు (6) డాక్టరు శ్రీమతి అనిబిసెంట్ గారల జీవిత చరిత్రలను పరిచయంచేశారు. ఈ పుస్తకంలో దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు గారి జీవితంనుంచి నేటి తెలుగుప్రజలు నేర్చుకొనవలసిన అంశాలెన్నో ఉన్నాయ్. ''శ్రీ నాగేశ్వరరావుకు హరిజనోద్ధరణయనినను, గ్రంథాలయోద్యమమనినను మిక్కిలి అభిమానము ఆయన మహాత్ముని హరిజనోద్ధరణ ఉద్యమమును ప్రారంభించకముందే ఈ మహోద్యమము చేపట్టి దాని ప్రగతికి కృషిచేసెను'' అనారు రచయిత 13 వ పుటలో ఈతరం యువతీ యువకులు తెలిసికొనదగు ప్రధానాంశంలో ఇదొకటి.

1924, 1929, 1930, 1934 లలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడుగా దేశోద్ధారకుడు వ్యవహరించి పెక్కు క్లిష్ట సమస్యలను పరిష్కరించారు. నిర్మాణ కార్యక్రమం ప్రాముఖ్యం గురించి గ్రామాలలో ప్రచారం చేశారు వారి హితవులను పాటించి, అమలు జరిపివుంటే మన గ్రామాలు ఎంత అభివృద్ధిచెంది ఉండేవో గదా? గ్రామాలలోని ప్రజలస్థితిగతులు ఎంత మెరుగ్గా ఉండేవో గదా అనిపించుతుంది. సాహిత్యరంగంలో దేశోద్ధారకుని కృషికి నిదర్శనాలు (1) భారతి (2) ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు (3) ఆంధ్రసచిత్రవారపత్రిక (4) ఆంధ్రగ్రంథమాల (5) బసవపురాణానికి వారు వ్రాసిన ''ప్రస్తావన'' స్వాతంత్ర్య సమరంలో దేశోద్ధారకుని పాత్రను సాధ్యమయినంతవరకూ పరిచయం చేశారు. ఈ రచయిత కృష్ణాపత్రిక సంపాదకులు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు దేశోద్ధారకుని గురించి వ్రాసిన ఈ క్రింది వాక్యాలతో ఈ వ్యాసాన్ని ముగించవడం సమంజసంగా ఉన్నది. 'శ్రీ నాగేశ్వరరావు

గారి ఉనికి లేనిగి దేశములో సేయుద్యమును తల ఎత్తలేదు. ఏ సంస్థయు పెరుగలేదు ఏ ప్రయత్నమును బలపడలేదు. అన్నింటికిని వెనుకనుండియే దేనికిని కట్టుబడక తన విశ్వదాతృత్వమును స్థిరపరచుకొనినారు.

ఇదొక జీవిత విధానం. ఈ విధానానికి అనుగుణంగానే శ్రీ శివలెంక శంభుప్రసాద్‌గారు 'ఆంధ్రపత్రిక' (దినపత్రిక)నూ, "ఆంధ్రసచిత్ర వారపత్రికనూ" "భారతినీ" నిర్వహించినారు వారి పెద్ద కుమారుడు శ్రీ రాధాకృష్ణగారు ఇంకొక అడుగు ముందుకు తీసుకువెళ్ళుతున్నారు ఆ విధానాన్ని పాండిత్యాన్ని లౌక్యజ్ఞానంతో సమన్వయింపజేసి, దాతృత్వంతోనూ, మానవతాదృష్టితోను తమ తాత గారి అడుగుజాడలలో నడుస్తున్నారు

దేశబంధు చిత్తరంజన్‌దాస్ జీవిత చరిత్రను పరిచయం చేస్తుంది రెండవ వ్యాసం. "నాన్ – కో – ఆపరేషన్" తీర్మానము ననుసరించి శ్రీ చిత్తరంజనుడు తనకు పుష్కలముగా ఆదాయము నిచ్చుచున్న న్యాయవాద వృత్తిని మిక్కిలి ఆనందముతో విడిచిపెట్టి ఒక సన్యాసివలె సామాన్య జీవితమును గడప మొదలిడెను. ఆపిమ్మట కొన్ని సంవత్సరములకు ఈ వదాన్యమూర్తి తనకుగల సర్వస్థిరచరాస్తులను ఒక వైద్యాలయమునకును, స్త్రీలకొరకు నిర్మించిన ప్రత్యేక ఆసుపత్రికిని వ్రాసి ఇచ్చెను. ఈ మహత్తర త్యాగమును దర్శించిన భారతీయుల హృదయములు కరగిపోయినవి. ఆ మహామహునికి "దేశబంధు" అను బిరుదమును ప్రసాదించి దేశము హృదయపూర్వకంగా ఆ సర్వసంగ పరిత్యాగిని గౌరవించినది అన్నారు 49వ పుటలో ఈ రచయిత.

"భారతదేశమున ఎట్టి పరిస్థితులలో ఈ తిరుగుబాటులు, విప్లవములు, జరుగుచున్నవో సరియైన పద్ధతులలో ఆలోచించి దాని నివారణకు తగిన చర్యలను తీసుకుని ఈ వ్యాధి నిర్మూలనకు తగిన ప్రయత్నమును తగిన విధముగా చేయవలెనని బ్రిటిష్ ప్రభుత్వానికి శ్రీ చిత్తరంజనుడు వ్రాసెనట (55వ పుట). ఇదే హితవును ఈనాటి దేశపాలకులకు ఇవ్వడం అసమంజసమవుతుందా? ఆ కారణాన్ని ఆనాడు సమూలంగా సరయిన పద్ధతిలో తొలగించి ఉండలేదు. కనుకనే ఈనాడు దేశంలోని ప్రజల స్థితిగతు లింత అధ్వాన్నంగా ఉన్నవనడం తప్పా?-

'ఆ మహామహుని దృష్టిలో స్వాతంత్ర్యమనగా ఏ కొద్దిమంది క్షేమముకొరకోగాక, అది భారతదేశమునందలి సర్వప్రజల సంక్షేమమునకు మూలభూతమైనప్పుడే నిజమైన స్వాతంత్ర్యమని భావించిన 'దూరపుచూపుగల మేధావి" అన్నారు 59వ పుటలో ఈ రచయిత. శ్రీ చిత్తరంజన్‌దాస్ మేధాశక్తినీ, దూరదృష్టిని ఇంకా చాలా వివరించవలసిన అవసరం వర్తమాన పరిస్థితులలో ఎంతయినా ఉన్నది

". .గాంధీజీ సూత్రావళి భాష్యకారుడునైన డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యపంతులు వేలుమడిచి లెక్కింపదగు అగ్రశ్రేణికి చెందిన భారత స్వాతంత్ర్య వీరయోధులలో ఒకరు" అన్నారు 61వ పుటలో ఈ రచయిత. డాక్టరు పట్టాభి అపరచాణక్యుడు ఆర్థిక శాస్త్రవేత్త, మహావక్త. వారు నెలకొల్పిన సంస్థ లనేకం ఈ నాటికీ దినదినాభివృద్ధి చెందుతున్నవి. డాక్టరు పట్టాభి జీవితాన్ని దేశసేవనూ పరిచయం చేస్తుంది ఈ వ్యాసం. శ్రీ పట్టాభి జైలులో నుండగా ప్రపంచ రాజ్యాంగము అను నొక గ్రంథము వ్రాసి ప్రచురించెనట. (83వ పుట) "శ్రీ పట్టాభిది ఆర్థిక దృక్పథమనియు, ఆయనది "బ్రాహ్మణమేధ" "వైశ్యహృదయము" అని (94వపుట) వర్ణించడంలో అతిశయోక్తి లేదేమో!

శ్రీ సుభాస్‌చంద్రబోస్ జీవితాన్ని పరిచయంచేసే వ్యాసం విద్యార్థులకూ, ఇంగ్లీష్‌రాని విద్యావంతులయిన తెలుగువారికీ ఉపయోగపడుతుంది.

శ్రీ గాంధీజీ తలపెట్టిన నిర్మాణ కార్యక్రమములను పరమావధిగా భావించి తదభివృద్ధికి పాటుబడిన నిరాడంబర సేవకుడు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర మేర్పడడానికి ఆత్మాహుతి అయిన అమరజీవి పొట్టి శ్రీరాములు.

"ఆత్మార్పణ, నిస్వార్థ ప్రజాసేవ, త్యాగనిరతి అను త్రిగుణములను నిండుగా అలవరచుకొని శ్రీ శ్రీరాములు, పదకొండు సంవత్సరముల దీర్ఘకాలము గాంధీ చరణ సన్నిధిలో అంతేవాసిగా గడపి

ఆ మహానాయకుని హృదయమును సంపూర్ణముగా చూరగొని ఆయన ఆంతరంగిక శిష్యు డయ్యెను" (146వ పుట)

ఈ సంపుటంలోని వ్యాసాలన్నింటిలోనూ డాక్టరు శ్రీమతి అనిబిసెంట్ గురించిన వ్యాసం బాగున్నది. అంతమాత్రానినే మిగతా వ్యాసాలు బాగా లేవని ఈ పరామర్శ ఉద్దేశం కాదు. దేని విలువ దానిదే. పోల్చిచూడటం అంత మంచి అభిరుచి అనిపించుకోవదు విశేషించి సాహిత్యంలో.

జీవిత వ్యాసాల సంపుటి కాబట్టి కళాశాలలకూ, గ్రంథాలయాలకూ బాగా ఉపయోగపడుతుంది.

ఓ పెద్ద లోపమని అనలేనుగానీ, వ్యాసరచన గురించి మరికొంత శ్రద్ధ వహించివుంటే బాగుంటుందనిపించుతుంది. చాలా పొడుగయిన వాక్యాలు చాలా ఉన్నాయ్ యీ వ్యాసాలలో. ఒకే వాక్యంలో రెండు మూడు క్రియలను వాడారు. వ్యాకరణరీత్యా తప్పు కాకపోవచ్చు. కాని సరళంగా ఉండే చిన్న వాక్యాలు పాఠకులనూ ఎక్కువగా ఆకర్షించుత వనే నా యీ మనవి.

—శ్రీ వి. ఎస్. అవధాని.

అనంతుని ఛందము :—

# 'సంయుక్త వర్ణ గణములు'

అనంతుని 'ఛందోదర్పణము' న 'సంయుక్త వర్ణ గణంబులు' అను శీర్షిక క్రింద రెండు పద్యములు కానవచ్చుచున్నవి. తొలిపద్య మున లక్షణము చెప్పబడినది. మలిపద్యమున లక్షణము లొసంగ బడినవి. కాని ఆ రెండు పద్యములును వ్యాఖ్యాసాపేక్షములుగా నున్నవి. ఏఁబదియేండ్లుగా ఈ పద్యములు రెండును పండితుల పరిశోధనదృష్టి కందినట్లుతోఁచకున్నది. ఆ పద్యములివి :

1. "జగణము నలమగు, గగములు
భగణములగు, గలము నగణవాచంబుఁగనున్
సగము నగణవగణములగుఁ
దగణము భలమగును సంయుతమొందిర్చినచోన్

2. మొగిళులు నలమగు, నిటులన్
సగణము సగణమగు నిటులనంగుని తండ్రీ!
తగణము; పాళులనంగా
భగణము. వాకిళ్ళు భలము వాకిలులనంగన్"

తొలి పద్యమందలి పూర్వార్థమున "జగణము నలమగును. గగము భగణమగును. గలము నగణమగును" అని లక్షణము చెప్పబడినది. ఈ క్రమమునందే మలిపద్యమందు లక్ష్యములనొసఁగవలెను. కాని అందలి లక్ష్యము లా క్రమములో లేవు. గగము భగణమగుటకును, గలము నగణమగుటకును లక్ష్యములు కానరాకున్నవి 'మొగిళ్ళు' అను జగణము 'మొగిళులు' అని— సంయుతము తీసివైచినచో- నలమగు ననుటకు మాత్రము లక్ష్యమొసఁగఁబడినది. అందుచే ఈ పద్యము లసమంజసములుగా, అసన్వితములుగా తయారైనవి. అనంతుఁడీ పద్యముల నింత అస్తవ్యస్తముగ రచించియుండునా? అసలెవ్వరును చెప్పని యీ 'సంయుక్త వర్ణగణంబు'లను అనంతుఁడొక్కఁడే యేల చెప్పెనో అర్థము కాకున్నది. నామట్టుకు నాకీ పద్యములు ప్రక్షిప్తములని తోఁచుచున్నది.

పై పద్యమును ఒకానొకరు "మొగిళ్లు జగణము, 'మొగిళులు' అని నలమగును ఇట్లే నగణ, సగణ, తగణములగును 'పాళ్ళు, 'పాళులు' అని భగణమగును. 'వాకిళ్ళు' తగణము. 'వాకిలులు' అని భలమగును. మిగిలినవాని కుదాహరణములీఁబడలేదు" అని టీకించినారు!

'మొగిళ్లు' 'మొగిలు' అనియున్నకాని నగణము కాదు 'మొగిళుల్' నగణమగుటలో తంటాలేదు. కాని 'మొగిళ్ళు' అను జగణము తగణ మెట్లగునో అర్థము కాకున్నది. 'మొగిళ్ళు' అనియున్న కాని తగణము కాదుకాదా! కావున ఈ టీక పరిగ్రాహ్యము కాకున్నది.

రెండవ పద్యమునందలి లక్ష్యములనుబట్టి మొదటి పద్యమును సవరించిన అన్వయము కుదురువడునేమో చూడవలెను. లక్షణ పద్యమందలి పూర్వార్థమునిటు సవరించుకొనవలెను.

"జగణము నలమగు, గగములు
సగణములగు గలము సగణసంజ్ఞను దనరున్"

ఇప్పుడు తరువాతి పద్యమందలి లక్ష్యములను పరిశీలింతము. 'మొగిళ్ళు' జగణము, 'మొగిళులు' నలమగును, అటే 'ఇట్లున్' అనుగగము 'ఇటులన్' అని సగణ మగును, 'ఇట్ట్న' అనుగలము

'ఇటులు' అని నగణ మగును కనుక పూర్వార్ధమునకు లక్ష్య లక్షణ సమన్వయము కుదురును. క్రమము పాటింపఁబడినట్లగును.

ఇక ఉత్తరార్ధము విమర్శనీయము.

''సగము సగణ వగణములగుఁ
దగణము భలమగును సంయుతముఁదీర్చినచోన్''

ఇందు సగము నగణ వగణములనగునియు, తగణము భలమగుననియు లక్షణము చెప్పఁబడినది సగము సగణ వగణము లగుటలో విప్రతిపత్తి లేదు. కాని తొలిముద్రణమున ఈ పాఠముకానరాదు. మలిముద్రణములందే యీ పాఠము పరిగ్రహింపఁబడినది. ఈ పద్య పాఠము పరవస్తువారి ప్రతిలోనిదని అధస్సూచిక తెల్పుచున్నది. ఈ 'సగము సగణవగణములగు' అను పాఠము పరిశీలితముగ గ్రహింపఁబడినట్లున్నది. కారణ మనంతుఁడు చెప్పిన తెలుగు ఛందములోని 29 గుణములలో—ఈ 'సగ' మెచ్చటను కానరాదు. ఇతర ఛందో గ్రంథకర్తలును ఈ 'సగ' మును పేర్కొనినట్లు కానరాదు. అందుచే ఉత్తరార్ధమందలి ప్రథమ చరణమును సవరించుకొనక తప్పదు. క్రింది పద్యమందలి ఉత్తరార్ధములోని లక్ష్యములను పరికించినచో ఈ విషయము స్పష్టమగును. లక్ష్యములనుబట్టి ఉత్తరార్ధము కూడ క్రింది రీతిగా నుండునని నా అభిప్రాయము.

''గగములె భగణములగు నీకఁ
దగణము భలమగును సంయుతము దీర్చినచోన్''

ఇప్పుడిందు గగము భగణము కూడ నగుననియు, తగణము భలమగుననియు చెప్పినట్లయినది. కనుక లక్ష్యము లిట్లుండవలెను.

''భగణము పాళులనంగాఁ
దగణము తాకిళ్లు భలము తాకిళులనఁగన్''

(ఇది నాకు తోఁచిన సవరణనుఁబట్టి యిచ్చిన పాఠము)

కాని యిదిట్లు ముద్రితమైనది·

''తగణము, పాళులనంగా
భగణము; వాకిళ్లు భలము వాకిళులనఁగన్''

పాఠమిట్లున్నచో అర్థము దురూహ్యము పైన చూపిన రీతిగా సవరించుకొన్నచో అన్వయము సరళముగ నుండును. లక్షణ క్రమమును కూడ పాటించినట్లగును.

కావున పై పద్యములు రెండును నా మతమున క్రిందచూపిన నట్లుండవలెను.

1. ''జగణము నలమగు, గగములు
సగణములగు, గలము నగణసంజ్ఞనుదనరున్
గగములె భగణములగు, నీకఁ
దగణము భలమగును సంయుతముఁ దీర్చినచోన్''

2. ''మొగిళులు నలమగు, నిటుల
న్నగణము, నగణమగు నిటులనంగునితంత్రీ!
భగణము పాళులనంగాఁ
దగణము తాకిళ్లు, భలము తాకిళులనఁగన్''

పండితులు వీనిని పరిశీలించి చర్చింపఁగలరని నమ్ముచున్నాను. ఏఁబదియేండ్లుగా అనన్వితములుగానున్న ఈ పద్యముల కొకగతి కల్పించుకొనవలసిన బాధ్యత పండితులపైనున్నదని సవినయముగ మనవి చేసికొనుచున్నాను.

—శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 210/- | రు. 180/- |
| 2 లేక 3వ కవరుపేజి | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | రు. 180/- | రు. 150/- |

### లోపలి పేజీలు

| | | | |
|---|---|---|---|
| పూర్తి పేజి | ... | రు. 150/- | రు. 120/- |
| అర పేజి | ... | రు. 78/- | రు. 66/- |
| పావు పేజి | ... | రు. 48/- | రు. 42/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సం. నకు వరుసగా 6 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | ఏజంటు ద్వారా | పోస్టు ద్వారా |
|---|---|---|
| విడి ప్రతి | రు. 1-50 | 1-60 |
| 6 మాసముల చందా | రు 9-00 | 9-60 |
| సంవత్సర చందా | రు. 18-00 | 19-20 |

మేనేజరు, భారతి

విజయవాడ-520003..